శ్రీరస్తు

# వాణిజ్య పూజ్యులు

(మొదటి భాగము)

1948



ఆంధ్ర [illegible]

[illegible]

సుల్తాన్ బజారు, హైద్రాబాద్.

'ఆంధ్రభూమి' సంపాదకుఁడు

ఆంద్ర శేషగిరిరావు బి. ఏ.,

వ్రాసినది

సర్వస్వామ్యములు గ్రంథకర్తవి
మొదటి కూర్పు
1948 నవంబరు

శ్రీ ఆంధ్ర శేషగిరి రావు, బి. ఏ.
రచియించిన గ్రంథములు

| | | | |
|---|---|---|---|
| | | | రు. అ. పై. |
| 1. | ఆంధ్రరమణీమణులు 1-వ భాగము | | 0-12-0 |
| 2. | ఆంధ్రరమణీమణులు 2-వ భాగము | | 0-12-0 |
| 3. | కేయూరబాహు చరిత్రము | ... | 0-12-0 |
| 4. | ఆంధ్రరాజభక్తులు | ... | 0-12-0 |
| 5. | ఆకుకూరలు | ... | 1- 0-0 |
| 6. | కాయకూరలు | ... | 1- 0-0 |
| 7. | దుంపకూరలు | ... | 1- 0-0 |
| 8. | వాణిజ్యసస్యాలు | ... | 0-12-0 |

విక్రయము :
ఆంధ్రభూమి బుక్కు డిపో
మదరాసు : 7.

ప్రచురణ :
జయనికేతనమ్
మదరాసు : 7.



# విషయసూచిక.





# ఉపక్రమణిక



విశాలవిశ్వమునందు వాణిజ్యమున పేరుమిగిలి పూజ్యులైన పదునెనమండుగురు ప్రముఖవర్తకుల విజయజీవితములు ఈ గ్రంథమున కీర్తితములు.

కాశన్ రచనలు—లైఫ్, బిజినెస్ మాగ్నెట్, ఫార్చ్యూన్, డైజెస్టు, పారేడ్ మున్నగు పత్రికలలోని వ్యాసములు ఈ గ్రంథరచనకు ముఖ్యాధారములు.

పదునెనమండుగురు వణిక్పుంగవులు ప్రదర్శించిన ప్రభుశక్తి, పురుషకారము కథించుటవలన ఈ గ్రంథము భవిష్యత్తు రూపించుకొను వీలుకల విద్యార్థులకు, ఐహికజీవితము జయావహము చేసికొను అవకాశము కల యువకులకు ప్రత్యేకముగా వరణీయమగుచున్నది.

దృక్పథము అనునది ఒకటి ఇంకను ఏర్పడి స్థిరపడని లేతవయస్సులో, తెన్నుతోఁచక తికమకపడెడు పచ్చియౌవనములో ఇట్టి గ్రంథములు పఠించుటవలన పఠితల మనస్సులు నౌకరీలమీఁదకు జోఁగక స్వతంత్రజీవనము మీఁదకు మరలుటకు ఎడముండును.

తమ భవిష్యజ్జీవితమును ప్రకాశమానము చేసికొనుటకు అవకాశము కల యువకులకు వ్యాపారజ్ఞానమును, వర్తకమర్మమును, వర్తకపకళిని, ఇతర కీలకములను, కిటుకులను ఈ పుస్తకములోని గాథలు వేలెత్తిచూపఁగలవు; చేయెత్తి చెప్పఁగలవు.

నిరుపేదలయింట పుట్టి తక్కువపెట్టుబడితో స్వతంత్ర జీవితము ప్రారంభించి, కోరికకు తగిన దీక్షతో వ్యవహరించి, సంకల్పమును సిద్ధింపఁజేయు ప్రయత్నములో వర్తకముసాగించి కోట్లకు పడగలెత్తిన ఈ వణిక్ఛిఖామణుల జీవితగాథలు ఇంతవఱకు ఒక్క కోటీశ్వరునకైన నోఁచిపుట్టని ఆంధ్రజాతికి ముఖ్యముగా మార్గదర్శకములు కాదగియున్నవి.

ఈ ప్రయోజనమును గుర్తించి ఆంధ్రమహాశయులు ఆంధ్ర యువక లోకమున దీనికి విశేషప్రచారమును కల్పింతురుగాక !

గ్రంథకర్త.

౧

# సైమన్ పాటినో

సాధారణముగ మన పెద్దలు సిరివచ్చునప్పుడు నారికేళములోని సలిలముభంగి తెలియకుండ వచ్చునని అనెదరు. ఆ మాటలను మనము ప్రాయకముగ నిజములని నమ్మెము. కాని ఇచట వివరింపఁబడుచున్న సైమన్ పాటినో జీవిత కథ చదివినచో మన పెద్దలమాటలు తప్పక చేకొనతగినవిగా నిర్ధారిత మగును.

మఱియొకసంగతి.

ఆఁడుబుద్ధి అపరబుద్ధి అని మనము మామూలుగ త్రోసివేయుదుము. కాని సైమన్ పాటినో అర్ధాంగిమాటను ఆలించి తన అభివృద్ధికి పునాదులువైచుకొనిన ఇందలి విషయమును తెలిసికొనినపిమ్మట మనము ఆ ధోరణిలో ఉండలేము.

ఇది నలువది ఐదేండ్లకు పూర్వపు ముచ్చట.

దక్షిణఅమెరికాకుచెందిన బొలివియా దేశమున సముద్రమట్టమునకు పండ్రెండువేల అడుగుల ఎత్తునఉన్న యాండీస్ అను పర్వతప్రదేశమునగల ఓరూర్ అను పట్టణమునందు జర్మన్ దేశీయుఁడు ఒకఁడు పలుసరుకులు అమ్మె ఒక చిన్నస్టోరు స్థాపించెను.

ఓరూర్‌లోని కిరాణాకొట్టుకు ఆప్రాంతమున వలసనెల కొని ఉన్న పలువురు ఖాతాదారులై ఉండిరి. ఆ ఖాతాదారు

లలో పెక్కుమంది తగరపుగనుల కామందులుగా, కాఫీ తోఁటల యజమానులుగా ఉండిరి.

ఓరూర్‌కిరాణాకొట్టులో మన కథానాయకుఁడైన డాన్ సైమన్ పాటినో గుమాస్తా. గుమాస్తాకూడ కాదు-బిల్లుకలక్టరు.

ఆ బిల్లుకలక్టరు ఉద్యోగమునందైనను అతఁడు వసూలు చేయవలసినది క్రొత్తబిల్లుల పైకము కాదు. పాఁతబిల్లుల పైకము.

పాఁత-చావు-బాకీల వసూలుపని ఎచ్చటనైనను తలనొప్పి పుట్టించునదియే. అందును బొలివియావంటి వలసదేశమున అది మిక్కిలి కష్టమైనది. అట్టి మిక్కిలికష్టమైనపనిని నిర్వహింపవలసిన ఉద్యోగమున నియుక్తుఁడై ఉన్నవాఁడు డాన్ సైమన్ పాటినో.

ఆ ఉద్యోగమున అతఁడు తఱచు పలుతావులను చుట్టి రావలసి వచ్చుచుండునది.

ఓరూర్‌నకు పెక్కుమైళ్ళదూరమున యున్సియా అని కుగ్రామము ఒకటి ఉన్నది. పరిసరమున కొన్ని తగరపుగనులుండుటయే ఆగ్రామమునకుఁగల కొద్దిపాటి ప్రాముఖ్యమునకు హేతువు.

ఆ గ్రామవాసియగు హిలేరియన్ ఆర్కి అనువాఁడు ఒకఁడు ఓరూర్‌నందలి జర్మన్‌స్టోరునకు పదునేడు పౌనులు బాకీపడెను. బాకీపడి చాలరోజులు ఐనది.

బాకీతీరుమానము కాకుండగనే హిలేరియన్ ఆర్కి ఎత్తుపడిపోయెను. అతనికి అప్పుడు చేతిలో పైసాకూడ లేకుండినది.

అట్టిస్థితిలో హిలేరియన్ ఆర్కివద్ద ఆ పాతబాకీ వసూలు చేయవలసిన బాధ్యత సైమన్ పాటినోపైఁ బడెను.

యున్సియా గ్రామమునకు పాటినోను పంపుచు జర్మన్ స్టోరుకీపరు కఠినాక్షరకలితములగు మాటలతో ఇట్లు ఆజ్ఞ ఇడెను: 'బాకీ వసూలుచేయక నీవు వట్టిచేతులతో తిరిగివచ్చెదవేని నిన్ను ఉద్యోగమునుండి తొలఁగించివైచెదను.'

ఉద్యోగభంగభయము హృదయమును కలగుండువెట్టి క్రుంగఁదీయుచుండఁగా పాటినో ప్రయాణమైపోయి యున్సియా చేరెను.

ఎక్కువ కష్టములేకుండగనే బాకీదారుని దర్శనము ఐనది. కాని దర్శనము ఐనంతమాత్రమున క్రొత్తగా ఒరుగునది ఏమి ? బాకీదారు పైకము ఇచ్చినకదా పాటినో హృదయభారము తగ్గుట ?

బాకీదారుఅగు హిలేరియన్ ఆర్కివద్ద ఒక్కపైసా అయినను లేదు. అట్టిస్థితిలో పాటినో హృదయము ఎట్లుండునో సులభముగనే ఊహించుకొనవచ్చును.

పాటినో తనహృదయమును ఆర్కికి విప్పిచెప్పినాఁడు: 'నేను రిక్తహస్తములతో పోయినచో నా ఉద్యోగమునకు ఉద్వాసనయే. ఏమిదారి ?'

ఈ వాక్యములు బాకీదారుని హృత్పిండమును చిదిపినవి. ఎట్లయినను బాకీతీర్చవలెననియే అతనికిని తట్టినది. కాని చిత్తమున తలంపు ఉండినమాత్రమున చేతిలో పైసా లేనప్పుడు అతఁడు ఏమిచేయఁగలఁడు ?

ఆలోచించినాఁడు. దీర్ఘముగ ఆలోచించినాఁడు. అనంతరము ఇట్లుచెప్పినాఁడు: 'ఈ పరిస్థితులలో నిన్ను వట్టిచేతు

లలో పంపుటకు నాకు ఎంతమాత్రమును మనస్కరించుటలేదు. ఈయవలెనని ఎంతగాఢముగ అభిలషించుచున్నను ఇచ్చుటకు నావద్ద పైకములేదు. కావున నాకుఁగల తగరపుగనిని మీ స్టోరుయజమాని హక్కు భుక్తములకు దస్తావేజు వ్రాసిఇచ్చెదను. ఈ తగరపుగనితప్ప నాకు వేఱు ఆస్తిఏమియులేదు. కనుక దయచేసి ఆదస్తావేజు స్వీకరింపుము.'

పాటినో చాలసేపు తటపటాయించినాఁడు. వట్టిచేతులతో పోవుటకంటె ఈ దస్తావేజు తీసికొనిపోవుటయే మంచిది అని అతఁడు నిశ్చయించుకొనినాఁడు. లేనిబావకంటె గుడ్డిబావ మేలని ఉద్యోగము నిలుపుకొన ఉవ్విళ్ళూరుచున్న పాటినోకు తోఁచినది.

ఎక్కడికి అక్కడికే వెంకటలక్ష్మి అని అనుకొని పాటినో హిలేరియన్ ఆర్కిచేత ఆ దస్తావేజు వ్రాయించి తీసికొనినాఁడు. తగరపుగని రూపమున ఆర్కి ఈయవలసిన పదునేడుపౌనులు ముట్టినట్లు పాటినో రసీదు ఇచ్చినాఁడు.

దస్తావేజుతో ప్రయాణమై పాటినో తన యజమాని కడకు వచ్చినాఁడు. చావుబాకీని ఇంతసజావుగా వసూలుచేసికొని వచ్చినందుకు యజమాని తన్ను ఎంతయో మెచ్చుకొనునని సైమన్ ఆశించినాఁడు.

కాని అతని ఆశయము నెఱవేరలేదు. నాణెముల గళగళ విన కుతూహలపడుచున్న యజమానికి ఈ తెలుపు నలుపు దస్తావేజుకాగితము ఎంతమాత్రమును నచ్చలేదు. కాఁగా అతఁడు పాటినోపై మండిపడినాఁడు.

'పౌనులకుబదులుగా ఎందుకును పనికిరాని తగరపు గనిని కొనివచ్చి నా మొగమున కొట్టుటకు సాహసించితివి. కావున

నిన్ను శిక్షించి తీరవలసినదే. కాకపోయినను నీవు వ్రాయించు కొనివచ్చిన ప్రదేశమున తగరము ఎక్కడఉండి ఏడ్చినది? అది వట్టి గొడ్రాళ్ళదిబ్బ. ఆ తగరపుగని నీకే ఉండునట్లు చేయుదును. నీ జీతములో ఆ పదునేడుపౌనులును మినహాయించు కొని ఆ తగరపుగనిని నీకే యిచ్చుచున్నాను. ఇంతవఱకు నీవు చేసిన సేవకు కృతజ్ఞుఁడను. ఇంకమీఁద నీపని నాకు అక్కఱ లేదు.' అని యుడుకుగాని బొబ్బరించినాఁడు,

పాపము! పాటినోకు ఆ తగరపుగని పుచ్చుకొనవలయు నని ఎంతమాత్రమును ఇష్టము లేదు. ఇష్టము లేకపోయినను ఆకొంటి తప్పదు. అపుడొక శిక్షగా ఆ తగరపుగనివచ్చి అతని [illegible] పట్టుకొన్నది. అభిలషింపకయే అతఁడు ఒక తగరపు గనికి యజమాని యైనాఁడు.

ఇంతకును ఆ తగరపుగని ప్రదేశము ఎట్టిది? మిట్ట [illegible] కొట్టి [illegible] కొండప్రదేశము. తగరము ఉన్నదేమో అని చూచుటకుగాను అందు అక్కడక్కడ గోతులుమాత్రము పెట్టబడిఉన్నవి. ఆ గోతులలో ఎక్కడను తగరపునామరూపము లేదు. మిగిలిన రాళ్ళమాత్ర మున్నవి వర్ణింప నెట్లు?

అట్టి తగరపుగనికి పాటినో అనుకోకుండ—అప్రయత్న ముగా—యజమాని యైనాఁడు. ఆగని పదునేడుపౌనులైనను చేయదని జర్మన్‌స్టోరుకీపరు తలంచినాఁడు. ధనవంతుఁడగు ఆతనికే అది అట్లుండ అతని తాబేదారును, అతఁడు ఇచ్చు జీతముమీఁద బ్రతుకువాఁడును అగు పాటినోకు ఎట్లుండును?

జీతము నష్టముమీఁద తనకు తగులుకొన్న—తగులం కొనుటలో తన ఉద్యోగమును ఊడఁగొట్టిన ఆ తగరపుగని

తనను అచిరకాలముననే ప్రపంచమునందలి కోటీశ్వరులలో ఒకనిగా చేయనున్నదని ఆ సమయమున అతఁడు ఎట్లు అనుకొనఁగలఁడు ?

బాకీ వసూలుచేయక వట్టిచేతులతో వచ్చినను పూర్తి జీతము పుచ్చుకొని ఉద్యోగమునుండి విరమించుకొని ఉందును కదా అని అతఁడు ఎంతయో విచారించినాఁడు. నేలకు పోవు దానిని నెత్తికి రాచుకొంటిమే అని ఆతఁడు ఎంతయో కించ పడినాఁడు.

ఎంత విచారించినను, ఎంత కించపడినను ఇఁక లాభము లేదు. ఆ తగరపుగనితో తంటాలుపడవలసినదే.

బిల్లుకలక్టరు సైమన్ పాటినో నిరుద్యోగి ఐనాఁడు. ఇఁక ఆతఁడు ఇప్పుడు ఏమిపని చేయఁగలఁడు ?

తలవని తలంపుగా తనకు చుట్టుకొనిన ఆ తగరపుగని ఎక్కడనో మారుమూలను కొండలమీఁద ఉన్నది. అచ్చట ఒక చిన్న ఇల్లుకూడ ఉన్నది.

ఆ నిరాధారస్థితిలో పాటినో, అతనిభార్య ఆకొండ కొంపలోనే కాఁపుర ముండుటకు నిశ్చయించుకొనినారు. ఆ పరిస్థితులలో వేఱె అద్దెఈయకుండ ఇల్లుదొరకినందులకు వారు అపరిమితమైన ఆనందమును పొందినారు.

పాటినో, అతనిభార్య తగరపుగనిపనిలో విశ్రాంతి ఎఱుఁగని దీక్షతో ప్రవేశించినారు.

తప్పనిసరియైన ఆ తగరపుగని పరీక్ష కొఱకు పాటినో కొన్నిపనిముట్లు కొనినాఁడు. 'చేసికొనిన కర్మమురా, శంభులింగమా !' అను తీరని విచారముతో పనిని ప్రారంభించి నాఁడు.

అదివఱకే ఉన్నగోతులకు జతగా మఱికొన్ని క్రొత్తగోతులు పెట్టబడినవి. కాని ఎచ్చటను తగరముయొక్క పొలకువ కానరాలేదు. విచారముతో పాటినో పాతాళమునకు క్రుంగిపోవుచున్నాఁడు.

ఇట్లుండ ఒకనాఁడు తవ్వుటలో తగరము కనిపించినది. పాటినో రేఖ బయలుపడినది. తళతళ మెఱయుచున్న తగరపు గడ్డలను కొన్నిటిని ఎత్తి అతఁడు పరీక్ష చేయించుటకు లాపాజ్ నగరమునకు తీసికొని వెళ్ళినాఁడు.

అచటి అమెరికన్ ఇంజనీరు ఒకఁడు వానిని పరీక్షించి ఇట్లు చెప్పినాఁడు.

'ఈ గడ్డలు తగరపుముద్దలు. తగరపుగనులు ప్రపంచమునందు అంతటను ఉన్నవి. కాని నీ ఈగడ్డలు మిక్కిలివిలువ ఐనవి. వీనిలో తగరపుపాలు హెచ్చుగా ఉన్నది. ఈగడ్డలలో నూటికి అఱువదివంతులు తగరమే. ప్రపంచమున మఱియే ప్రదేశమునను తగరము ఇంత హెచ్చుపాలులో లేదు.'

ఇంజనీరు చెప్పిన ఈమాటలువిని పాటినో తనగనియొక్క విలువను కొంతకుకొంత ఆకళించుకొనఁ గలిగినాఁడు. అతని తగరపుగనితో దొరయుపాటిది అంతవఱకు ప్రపంచమున కనుఁగొనఁబడియుండలేదని ఆపరీక్ష తేల్చినది.

తగరము బంగారమంతటి విలువగల లోహము కాకపోవచ్చును. కాని కొన్నికొన్ని పరిశ్రమలలో అది అత్యంత ప్రాముఖ్యమువహించి ఉన్నదని అతఁడు తెలిసికొనినాఁడు.

ఇప్పుడు ఇఁక గనిపని ప్రారంభము చేయుటకు పెట్టుబడి కావలసిఉన్నది. అట్టి పెట్టుబడికిగాను అతనిభార్య పినతండ్రి అఱువదిపౌనులు అప్పు ఇచ్చినాఁడు.

అనంతరము రెండుసంవత్సరములు అగనివద్దనే పాటినో దంపతులు అజ్ఞాతవాసముచేయుచు గనిపనిని సాగించినారు. కొందఱు కార్మికులను పనికి కుదుర్చుకొనినారు. ఆ కార్మికుల తోపాటు వారుకూడ పనిచేయువారు. పని ఉదయము మొదలు రాత్రివఱకు సాగుచునే ఉండునది.

గనిలోనుంచి ఒకవాగన్ తగరమును తవ్వి దానిని అమ్మి ఆడబ్బుతో పాటినో తనగనికి ప్రక్కను ఉన్నభూమిని కొనివేయుచుండువాడు.

రెండేండ్లు గడచుసరికి పాటినో కొలువులో కొన్నివందల మంది పనివాళ్ళు పనిచేయుచుండిరి. వారము వారము అక్కడ నుండి వాగనులకొలఁది తగరము లాపాజ్ నగరమునకు రవాణా అగునది.

ఐనను పాటినో సామాన్యకార్మికునివలె పనిచేయుట మానలేదు. [illegible] అతఁడు క్రొత్తభూములను కొనివేయుచుండువాఁడు.

ఇట్లుండఁగా ఒకనాఁడు పాటినోవద్దకు ఒక క్రొత్తమనుష్యుఁడు వచ్చినాఁడు. అతఁడు న్యూయార్కు మహానగరము లోని ప్రసిద్ధమైన గుగెన్‌హీమ్ బ్యాంక్ ప్రతినిధి. అమెరికా సంయుక్తరాష్ట్రములలోని లోహావర్తకులనుండి అతఁడు పాటినోకు శుభవార్తను ఒకదానిని తెచ్చినాఁడు.

పాటినో గనులను అన్నిటిని ఆవర్తకులు కొనివేయవలయునను కుతూహలముతో ఉన్నారని ఆప్రతినిధి తెలిపినాఁడు. అగుచో వారు క్రయధనము ఎంత ఈయనున్నారని సైమన్ పాటినో ఆప్రతినిధిని అడిగినాఁడు. ఒకలక్షపౌనులు ఈయనున్నారని ఆ ప్రతినిధి చెప్పినాఁడు.

లక్ష పౌనులు !

సైమన్ పాటినో ఆమాటలను నమ్మలేకపోయినాఁడు. మూఁడేండ్లలో లక్ష పౌనుల ఆర్జన. పాటినో ఆనందోద్వేలితుఁడైనాఁడు.

ప్రతినిధి అమ్మకపు కాంట్రాక్టును పాటినో ఎదుట ఉంచినాఁడు. ఆ కాగితముమీఁద సంతకము పెట్టు ఉద్దేశముతో కలము అందుకొనుటకు పాటినో కుడిచేతిని చాచినాఁడు.

ఇంతలో అతనిభార్య అడ్డువచ్చి ఇట్లు చెప్పినది:

'అమెరికన్ లోహావర్తకులు వారియంతటవారు మన గనులకు లక్షపౌనులు ఇచ్చెదమనిన ఆగనులవిలువ కనీసము పదిలక్షల పౌనులుగ ఉండియుండవచ్చును. కాఁబట్టి ఈ కాంట్రాక్టుమీఁద సంతకము చేసినందుకు కొద్ది సంవత్సరములలో తప్పక అమెరికాలో నీవు అందఱికంటె ధనవంతుఁడవు కాఁగలవు.'

ఉత్సాహవంతుఁడైన పాటినో భార్యమాట పాటించినాఁడు.

మఱి మూఁడు సంవత్సరములు నాగినవి. గుగెన్‌హీమ్ బ్యాంకర్లు తిరిగి కబురుచేసినారు. ఈసారి భార్య అనుమతిని అందుకొని అతఁడు విమానముమీఁద న్యూయార్కు మహానగరమునకు వెళ్ళినాఁడు.

ఆ తగరపుగనులలో పనిచేయుటకు ఏర్పడిన కంపెనీలో సగమునకుపైగా వాటాలు అతనికి ఇచ్చినారు. మీఁదుమిక్కిలి గనులను తమస్వాధీనము చేసినందుకు కంపెనీవారు పదిలక్షల పౌనులను అతనికి ముట్టచెప్పినారు.

అతని అర్ధాంగియొక్క ఒకనాఁటి మాట ఈనాఁడు ఇట్లు అక్షరముగ నిజమైనది.

అప్పటినుండి పాటినో మఱి కొండలలో పనిచేయలేదు. వ్యాపారనిర్వహణములో ఆఱుమాసములు వివిధదేశములు చుట్టివచ్చినాఁడు. ప్రపంచములోని తగరపు పరిశ్రమల సంఘమునకు అతఁడు అధ్యక్షుఁడు. ఆ సంఘసభ్యులు అందఱు అధిక ధనవంతులు. వారి అందఱికంటె సైమన్ పాటినో ధనవంతుఁడు.

ఒకప్పుడు ఓరూర్‌లో బిల్లుకలక్టరుగా ఉన్న సైమన్ పాటినో అదృష్టదేవతాప్రసాదముచేత ఇప్పుడు ఇంతటివాఁడు ఐనాఁడు.

పాటినో అఱువదిఐదేండ్ల వయసునకూడ యువకభావపూరితుఁడై ఉండినాఁడు. అతఁడు ప్రపంచమందలి ధనవంతులలో ఒకఁడగుటయే కాకుండ సుఖవంతులలోకూడ ఒకఁడై ఉండినాఁడు.

"మీ జీవితమునకు అంతటికిని సుఖమయక్షణము ఏది?" అని అడుగఁగా అతఁడు ఇట్లు చెప్పినాఁడు:

"రెండులక్షల పౌనులకు యజమానిని ఐనాఁడు నేను పొందిన ఆనందమునకు అంతులేదు. ఐతే అప్పటి నా ఆనందము ధనవంతుఁడను ఐనందుకు కాదు. నాపూర్వపు యజమాని ఐన ఓరూర్ కిరాణా దుకాణదారునకు తంతి పంపఁగలిగినందులకు. హిలేరియన్ ఆర్కిగని పదునేడుపౌనులయినను చేయదనియే ఇప్పటికికూడ మీ అభిప్రాయమా? అని ఆయనను ఆ తంతిలో ప్రశ్నించినాను."

దుకాణదారుమీఁద తనకుఁగల కసిని పాటినో ఇట్లు ప్రసాదముగా తీర్చుకొనినాఁడు.

కసితీర్చుకొనుసరికే అతఁడు వేసివెయ్యని ధనవంతుఁడై నాఁడు. అనంతరము అచిరకాలముననే అతనిరాబడి దినమునకు పదునైదువందల పౌనులకు పెరిఁగినది. దినమునకు పదునైదు వందల పౌనులు ! ఎంతటిరాబడి ! పదునేడుపౌనుల జీతపు నష్టమునకు తనకు ఇష్టములేకున్నను తనపాలఁబడిన తగరపుగని వలననే అతఁడు ఇప్పుడు ప్రతి ఐదేసి నిముసములకును పదునేడు పౌనులు ఆర్జించుచున్నాఁడు.

ఒక్కసారి పదునేడుపౌనులు నష్టపడిన ఆ అదృష్టవంతుఁడు తరువాత ప్రతిఒక్క ఐదేసి నిముసములకును పదునేడు పౌనులవంతున లాభము తీయుచున్నాఁడు. ఈ లాభముముందు ఆనష్టము ఎంతకొద్దిపాటిది? అయితే మాత్రము ఈ తగరపు గని మొదట తనపాలఁబడినపుడు పాటినో ఏమాత్రమైన ఉత్సాహము చూపినాఁడా ?

ఇంతకును ఈకథ అంతయువిని ఆ జర్మన్ స్టోరుకీపరు ఏమనినాఁడో? అతని హృదయగోళమున క్షోభము ఎంతగా కుతకుత ఉడికినదో ? అదృష్టవంతుని పాడుచేయువాఁడు, నిర్భాగ్యుని బాగుచేయువాఁడు లేఁడనువాక్యము సత్యసమ్మతమైనదే యనుటకు ఇంతకంటె నిదర్శనము ఏమికావలయును ?

ఇపుడు పాటినో కోటికి పడగలెత్తిన విత్తవంతుఁడు. అగుఁగాక! హఠాత్తుగ ధనవంతులైన ఇతరులవలె అతఁడు ధనమదాంధుఁడు కాలేదు. తనవిత్తమున విశేషభాగము అతఁడు బొలివియా దేశపు సాముదాయకాభివృద్ధికి వెచ్చించినాఁడు.

పాటినో జీవితము మనకు ఒకమహత్తరసత్యమును బోధించుచున్నది. దురదృష్టమని మనము అనుకొనఁజాలు ఒక విషయము నడచినను అంతమాత్రమున దానిని మనము విడ

నాడకూడదు. దానిని అనుభవమునకు తెచ్చుటకే ప్రయత్నింప వలయును.

ధైర్యముతో ముందుకు సాగిపొండు. కనిపించుచున్న విషయములు ఎంతయు నిరుత్సాహములుగా ఉండుగాక! పోరాడవలెను. మీ రేఖ బయలుపడవచ్చును; మీ అదృష్టము కలిసిరావచ్చును. పాటినో రేఖ అట్లే బయలుపడినది. అతని అదృష్టము అట్లే కలసివచ్చినది.

ప్రథమ ప్రపంచ మహాసంగ్రామావసరమున తగరము యొక్కయు, తగరపు రేకులయొక్కయు వెలలు అమితముగా పెరిగినవి. అంతతో జాన్ సైమన్ పాటినో ధనసంపద మిన్ను ముట్టినది. ప్రపంచమునందలి తగరపు వర్తకులలో అతడు సాటిలేని మేటి అయినాడు. ఫోర్డు మోటారు రాజయినట్లే పాటినో తగరపురాజైనాడు. ఆ సమరకాలమున అతని రాబడి సంవత్సరమునకు పదిలక్షల పౌండ్లను మించినది.

స్పెయిన్ దేశపు రాజధానియగు మాడ్రిడ్ నందు స్పెయిన్ దేశపు కొలువున బొలీవియా మంత్రిగా అతడు కొంత కాలము పనిచేసినాడు.

ఆర్థికముగా లభించిన పలుకుబడి ప్రత్యేక ప్రాధాన్యము, రాజకీయముగా అతనికి ఇంతటి ఉన్నతోద్యోగము వచ్చుటకు కారణము ఒకప్పుడు అతని ఉద్యోగమును ఊడగొట్టిన ఆ పను నేడు పౌనుల తగరపు గనియే.

'అదృష్టము' అనుదానియందు నమ్మకములేని వారికి కూడ ఈ కోటీశ్వరుని అద్భుతజీవితవృత్తాంతము అదృష్టము నందు చెదరని నమ్మకమును కలిగించును.



౨

# ఫ్రాంక్ హెచ్. డేవిస్

నేఁటి భీమాగగనమున శుక్రతారలవలె వెలుఁగొందు చున్న కొద్దిమంది మహనీయులలో ఫ్రాంక్ హెచ్. డేవిస్ ఒకఁడు.

ఎనిమిదివేలమంది ఇన్సూరెన్సు ఏజంట్లపై అతఁడు మేనేజరు. విశేషించి అతఁడు తనకంపెనీకి ఉపాధ్యక్షుఁడుకూడ.

అగుఁగాక!

ఇరువది వత్సరములకు పూర్వము అతఁడు ఉద్యోగము లేకుండెను. అప్పుడు అతనికి ఎట్టిధనముకాని లేదు. అతనికౌశలము ఏవిషయమున కలదో కనుఁగొనబడలేదు. విలువగల ఎట్టి అనుభవముకాని అప్పుడు అతనికి లేకుండెను.

ఇరువదితొమ్మిదిఏండ్లు పైబడినను అతఁడు తనదేశమును దాటి బయటకు పోయియుండలేదు.

ఒక ఉద్యోగమునుండి మఱియొక ఉద్యోగమునకు తఱచు మాఱుచుండువాఁడు.

వ్యవసాయక్షేత్రమున పనివాఁడుగా ఉండినాఁడు, ఉపాధ్యాయుఁడుగా పనిచేసినాఁడు, కాన్వాసరుగాకూడ ఉండినాఁడు, తుదకు గుమాస్తాగిరికూడ చేపట్టినాఁడు.

ఒకదానియందును అతఁడు మంచిపేరు సంపాదించలేదు.

మానిసి ఆఱుఅడుగుల ఎత్తరి, గుణములు మాత్రము సాధారణమైనవి. అతఁడు సుస్వభావముకలవాఁడు, ప్రేమింప తగినవాఁడు, పామేదామనిషి. అతనిది బట్టతల—అతనివి పింగళనేత్రములు.

ఇరువదితొమ్మిది ఏండ్లవఱకును అతని జీవితము జయమార్గమున పడలేదు; అతఁడు స్థిరమైన ఉద్యోగి కాలేదు; చెప్పతగినది ఏదియు అతఁడు చేసియుండలేదు. ప్రత్యేకసామర్థ్యము కలదని సూచించు కారణము ఒకటియు అతనిదగ్గఱ లేకుండెను.

అప్పుడు ఆతఁడు మేల్కాంచినాఁడు. జీవితమధ్యమున ఇట్లు మేల్కాంచినవారు మిక్కిలి తక్కువగా ఉన్నారు. కొందఱు చనిపోవువఱకును మేల్కాంచనే మేల్కాంచరు. డేవిస్ మేల్కాంచిన తోడనే తనజీవితవిధానమును నిష్కర్ష చేసికొని చులుకుగా కార్యకలాపమునకు కడంగినాఁడు.

ఒకదానినుండి మఱియొకదానికి దొర్లుపద్ధతిని విడనాడి ఇఁకమీఁద స్థిరమైన ఒకవిధానమును అవలంబించి పోవలయును అను భావము అతని మనమున జ్వలితము కాఁజొచ్చెను. తన్ను తాను విమర్శించుకొని తాను లెస్సగ చేయఁగల కార్యమును కనుఁగొనుటయే ఆతఁడు ఇప్పుడు చేయవలసినపని.

అగుట ఆతఁడు తన్ను ఛేదించుకొని చూచుకొన్నాఁడు. తనదగ్గఱ రెండేశక్తు లున్నట్లు ఆతఁడు తెలిసికొన్నాఁడు.

ఆ రెండుశక్తులు :

౧. వస్తువిక్రయమున విశేషాభిరుచి.

౨. అన్నితరగతుల మానవులయందును తీవ్రమైనశ్రద్ధ.

'ప్రజాసమూహముతో నేను విక్రయవ్యాపారము సాగించుటకు ఎంతయు తగియున్నాను. కాని నేను అమ్మగలది ఏది?'

అని అతఁడు నిశ్చయించుకొని తన్నుతాను ప్రశ్నించుకొనఁ జొచ్చెను.

ఈ ప్రశ్నకు సమాధానము అన్వేషించుటలో మఱి కొన్ని ప్రశ్నలు పొడచూపినవి. 'నేను పూర్ణముగా విశ్వసించు విక్రయవ్యాపారము ఏది? ఏ వ్యాపారము నాకు హెచ్చు ఉపకారమును చేసినది? నేను ఇతరులకు విశ్వాసపూర్వకముగ దేనిని సిఫారసు చేయఁగలను?'

వివ్యుద్వేగమున 'భీమావ్యాపారము' అను సమాధానము అతనికి స్ఫురించెను.

తుపాకిప్రేలుడు ప్రమాదమున డేవిస్ తండ్రి అకస్మాత్తుగ మరణించియుండెను. పదునైదువందల పౌనులకు డేవిస్ తండ్రి ఒక భీమాపట్టాను కొనియుండెను. ఇదియే అతని ఆకస్మికమరణమునకు అనంతరము అతని కుటుంబమును, దారిద్ర్యమునుండి కాపాడకలిగెను.

'నా తండ్రికి ఆ ఇన్సూరెన్సు పోలసీని అమ్మిన మహాశీయుఁడు నాకును, నాతల్లికిని ఎప్పుడుకాని ఉన్న, ఉండఁగల స్నేహితులలో అత్యుత్తముఁడు' అని ఫ్రాంక్ హేచ్. డేవిస్ అప్పుడు తలంచెను.

తోడనే అతఁడు ఇన్సూరెన్సు కాన్వాసరు ఉద్యోగమునకు దరఖాస్తుపెట్టెను. ఆ దరఖాస్తుమీఁద అతనికి ఉద్యోగము లభించెను.

అప్పటికి అతనికి ఇన్సూరెన్సునుగూర్చి ఉన్నజ్ఞానము మిక్కిలి కొద్దిపాటిది. ఆఱుమూడువారములు పరిశ్రమించియు అతఁడు ఒక పట్టాదారునైనను కూర్పలేకపోయెను.

ఇంతతో ఆతఁడు నిరుత్సాహపడలేదు. ఇన్సూరెన్సు వాఙ్మయమును దీక్షతో చదువుటకు కడంగెను. రాత్రింబవళ్లు ఏకరీతిని అతఁడు ఇన్సూరెన్సు పుస్తకములు చదువ ప్రారంభించెను. కాన్వాసింగు సందర్భమున ప్రజలు తన్ను అడుగఁగల విషమప్రశ్నలకు అన్నిటికిని తగు సమాధానము ఈయఁగల విజ్ఞానము తనకు కలుగువఱకును ఆతఁడు ఆ పుస్తక పఠనదీక్షను సడలింపలేదు.

అప్పటికి ఆతనికంపెనీకి చెంది రెండువేలమంది ఏజెంట్లు ఉండిరి. ఒక్క నెలలో హెచ్చుపట్టాదారులను చేకూర్చగల ఏజెంటునకు బహుమానము ఈయఁగలమని కంపెనీవారు ప్రకటించిరి.

డేవిస్ ఈ అవకాశమును అందుకొన్నాఁడు. తనదీక్షను ఉపయోగించుటకు, తనపట్టుదలను చూపుటకు తగిన అదను వచ్చినదని అతఁడు గుర్తించినాఁడు. రాత్రి, పగలు అను భేదములేక అతఁడు పనిచేసినాఁడు.

అంతకు పూర్వపు రికార్డులను అన్నిటిని తలదన్నినాఁడు. కంపెనీవారి బహుమానమును పొందినాఁడు. ఈ బహుమాన ధనమును మాత్రమేకాక కంపెనీవారివలన రెండువందల పౌనుల బోనసు ధనమునుకూడ ఆతఁడు పొందకలిగినాఁడు.

ఇప్పుడు ఆతఁడు పూర్తిగా మేల్కాంచి ఉన్నాఁడు. అభివృద్ధి అను నిచ్చెనపై ఒక్కొక్కమెట్టు పైకి ఎక్కుచున్నాఁడు.

కాగా ఈకంపెనీలో తనస్థానమునకు రాజీనామా ఇచ్చి ఆ దేశమునందలి మిక్కిలి పెద్ద ఇన్సూరెన్సు కంపెనీలలో

ఒకటియగు మఱియొక కంపెనీయందు ఇంతకంటె కష్టతరమగు ఉద్యోగమునకు అతఁడు దరఖాస్తు పెట్టినాఁడు.

'ఏ ప్రదేశమున విశేషవ్యాపారము కొనివచ్చుట మీకు కష్టతరమై ఉండెనో ఆ ప్రదేశమును నాకు ఇండు. అచట వ్యాపారనిర్మాణము కావించుటకు నాకు పూర్తి స్వాతంత్ర్యమును ఒసఁగుఁడు.' అని ఆ క్రొత్తకంపెనీవారిని అతఁడు కోరెను.

ఆ కంపెనీవారు అతనికి ఉద్యోగము ఇచ్చిరి. అతను కోరిన సౌకర్యములు అన్నియు కలిపించిరి. అంతవఱకును భీమావ్యాపారమున గొడ్డుమండలముగా ప్రసిద్ధికెక్కిన ప్రదేశమును అతఁడు చేకొనెను.

అట్టి ప్రదేశమున అతని దీక్షవలన ఒక్కఏఁడాదిలో ఇన్సూరెన్సు వ్యాపారము మూఁడులక్షల పౌనులనుండి ఆఱు లక్షల పౌనులకు పెరిఁగెను. ఎంతటి అభివృద్ధి! రెట్టింపువ్యాపారము—రెండవ సంవత్సరమున ఆ గొడ్డుమండలముననే ఆ దీక్షాదక్షుఁడు పదిలక్షలపౌనుల భీమావ్యాపారము కావించెను.

ఈ గొడ్డుమండలమును మంచి పంటప్రదేశముగా మార్చిన ఆ భీమాకర్షకుని ఆ కంపెనీవారు అచటనుండి మఱియొక గొడ్డుమండలమునకు మార్చిరి. ఐదు సంవత్సరములలో అచట భీమాపట్టాల విక్రయము పంద్రెండులక్షలనుండి అఱువది లక్షలకు పెరిఁగినది.

ఇంతటి ఘనకార్యనిర్వహణమునకు ప్రతిఫలముగా అతఁడు ప్రధానకార్యాలయమునకు ఆహ్వానింపఁబడి కంపెనీకి వైస్ప్రెసిడెంటుగ ఎన్నుకొనఁబడెను.

వైస్ ప్రెసిడెంటు హోదాలో అతనిపని ఎట్టిది? ఆ కంపెనీవారి ఎనిమిదివేలనుండి ఏజెంట్లను నడుపుట. ఎంతటి అభివృద్ధి! ఇది అంతయు తొమ్మిదిసంవత్సరముల స్వల్పకాలములో జరిగినది.

అతని ఈశక్తి అంతయు ఎందుకలదు ?

వినువారిని సమ్మోహనమున ముంచగల అతని వాక్చాతుర్యమునందును, ఎదుటివారిని సమ్మతింపఁజేయఁగల అతని మనఃపూర్వకమైన వ్యాపారవిశ్వాసమునందును.

ఉపన్యాసముచేతనే అతఁడు ఏజెంట్లలో కార్యశౌర్యమును కలిగించి వృద్ధిఎక్కించఁగలఁడు.

ఇపుడు ఆతనికి కొలఁదిఇడరాని ధనము, యశోధనము సమకూడి ఉన్నవి.

సమకూడి ఉండుఁగాక !

అంతమాత్రమున ఆతని తల తిరిగిపోలేదు. ఎప్పటివలెనే అతఁడు కులాసాపురుషుఁడుగా, స్నేహపాత్రుఁడుగా ఉన్నాఁడు. అతఁడు ఆపదలందు అంచితధైర్యము వహించును; ఎంతటి క్లిష్టపరిస్థితులనైనను ప్రసన్నచిత్తముతోడనే ఎదుర్కొనును.

భీమాఏజెంట్లు తమ వృత్తినిగూర్చి గర్వపడునట్లుగా చేయఁగల సామర్థ్యము ఆతనికడ అగ్గలము.

అతఁడు తన ఏజెంట్లకు కావించు ఉపదేశములనుండి కొన్నివాక్యములు:

"ప్రపంచమున కల వ్యాపారముల అన్నిటిలోనికిని అత్యుత్తమమైనదానియందు నిమగ్నులమై ఉంటిమను భావము మీకు లేనిచో మీరు మాకంపెనీకి పనిచేయుట నేను కోరను."

"తాను చేయు పనియందు ఒకఁడు హృదయపూర్వకమగు విశ్వాస ముంచినఁగాని జయమును అందనేరఁడు."

"సక్రమముగ నిర్వహింపఁబడుచున్న ఇన్స్యూరెన్సు కంపెనీవలన ఈ మనజాతికి లభించువిలువను మీరు గుర్తింపకుండినచో—మానవసేవ చేయఁగల సదవకాశము లభించినందులకు ఉత్సాహముతో ఉద్వేలితులు కాఁగల సామర్థ్యము మీకు కొఱవడినచో మీకాలమును, నాకాలమును వెచ్చించుట నిష్ప్రయోజనమే యగును."

కాన్వాసింగు సమయమున తన్ను ఎదిరించిపలుకువారితో అవసరమగుచో అతఁడు తిరిగి ఎదిరించియే పలుకును.

ఒకసారి ఒకఁడు వేళాకోళముగా మాటలాడ ప్రారంభించెను. 'నా భార్యకు నేనేల ఒక పెద్ద ఇన్స్యూరెన్సుచెక్కును ఈయవలయును? నా మరణానంతరము ఆమె ఒక అప్రయోజకుని వివాహమాడవచ్చును. ఆ అప్రయోజకుఁడు నాకూర్చిన ధనమును వెచ్చింపవచ్చును.' అని అతఁడు అనెను.

దానికి డేవిస్ ఇట్లు బదులుచెప్పెను: 'నీభార్యకు నీవు తగుధనమును ఇచ్చిపోవుదువేని ఆమె మఱియొకసారి అప్రయోజకుని వివాహమాడవలయుట కలుగదు.'

'ఏమిటి? నేను అప్రయోజకుఁడనని నీతలంపా?' అని కోపముతో అతఁడు మండిపడెను.

'తనభార్యను గురించి నీవు మాటలాడిన విధముగా మాటలాడెడువాఁడు ఎవఁడైనను అప్రయోజకగుణభాసితుఁడే' అని డేవిస్ నెమ్మదిగా అనెను.

ఎదుటివాఁడు అందలిసత్యమును గ్రహించినాఁడు. అందుతో అతనికోపము తగ్గినది. కొలఁదినిముసముల అనంతరము

అతఁడు భీమాదరఖాస్తు పత్రమును పూర్తిచేసి సంతకముపెట్టి డేవిస్‌నకు అందిచ్చినాఁడు.

భీమాఏజెంట్ల జనరల్ మేనేజరుగా అతఁడు ఆ ఏజెంట్లను నడుపుటలో స్థిరమైన విధానముకలిగి ఉండెను. ఏజెంట్లలో అతఁడు ముఖ్యముగా కోరు గుణములు మూఁడు: ఉత్సాహము, దూరదృష్టి, సాహసము. భీమాపట్టా విక్రయమునకు కావలసిన గొప్పగుణములు ఈమూఁడును. తన ఏజెంట్లకడ ఇవి ఉన్నవో లేవో అతడు బాగుగ పరీక్షించును. ఈ గుణములున్న ఏజెంట్లనే అతఁడు ఎన్నుకొనును. మిగిలిన కార్యవిధానమును గురించిన స్వాతంత్ర్యము అంతయు ఆ ఏజెంట్లకే వదలును.

'హెచ్చు స్వాతంత్ర్యము ఇచ్చుటచేతనే హెచ్చు బాధ్యత వహించుటకు ఏజెంట్లు హెచ్చు ఉత్సాహము కలిగి ఉందురు.' అని అతడు చెప్పను.



# 3
# ఫాయిల్ సోదరులు

ఫాయిల్ సోదరులది 'ది ఫాయిల్ బ్రదర్స్' అను నామముతో సెకండుహ్యాండుపుస్తకములతో వర్తకముచేయు కంపెనీ. ఆ కంపెనీ ప్రధానకార్యస్థానమందిరము ముప్పది వేల చతురపుటడుగుల వైశాల్యముకలది; అఱు అంతస్థుల బ్రహ్మాండభవనము. రెండులక్షల గ్రంథసంపుటములు ఒక్కసారిగ నిలువచేయుటకు ఆ మందిరమున ఏర్పాటులు కలవు. సెకండుహ్యాండుపుస్తకములను వీ.పీ.గా పంపుఁడని ఆర్డరు

ఇచ్చు జాబులు ఆ కంపెనీకి దినమునకు రెండు వేలకుపై బడి వచ్చు చుండును.

అట్టి కంపెనీచరిత్ర తెలిసికొనుటకు ఎవరికి కుతూహల ముండకుండును?

నలుబదివేండ్లకు పూర్వపు ముచ్చట.

లండనులో ఫాయిల్ వంశమున పుట్టిన సోదరులు ఇరువురు సివిల్ సర్వీస్‌లో చేరుటకై ప్రవేశపరీక్షకు పోయిరి. కాని వారికి పరీక్షలో జయముకలుగలేదు. పరీక్షలో తప్పిపోవుటయే వారికి వరప్రసాదమైనది. ఆ పరీక్షలో తప్పిపోవుటయే వారి అదృష్టమునకు అంకురార్పణము ఐనట్లయినది.

కాని—పరీక్ష తప్పిపోయిన క్రొత్తలో వారు చాల డీలుపడిపోయిరి. పరీక్షపోయినది. ఇంక ఏమిచేయుట? భావి అగమ్యగోచరముగ ఉండినది.

పెద్దవాని నామము విలియమ్ ఎ. ఫాయిల్; చిన్నవాని నామము గిల్బర్టు యస్. ఫాయిల్.

వారితండ్రి షోర్‌డిచ్ నందు టోకుగా పలుసరుకులు అమ్మువాడు. టోకువర్తకుని తనయులైనను ఆ బాలురకు విశేషముగ ఆస్తిపాస్తులు లేకుండెను. వారికడఉన్న సెకండు హ్యాండుపుస్తకములే చరమూపకముగ వారి ఆస్తిగా ప్రధానముగ పోర్గొనతగినవై ఉండెను,

ఆ సోదరులలో ఒకడు రెండవవానితో ఒకసారి 'ఈ పాతపుస్తకములను అమ్మవచ్చునుకదా!' అని అనెను.

ఎట్టి మంచిక్షణమున ఆ బాలుని నోటినుండి ఆవాక్య ముద్గారితమయ్యెనో కాని ఎట్టి సంకోచమునులేక రెండవ సోదరుడు ఆ పుస్తకములను అమ్ముటకు అంగీకరించెను.

తోడనే వారు ఒక చిన్న ప్రకటనను వ్రాసిరి. దానిని వారు విద్యావిషయకమగు ఒక పత్రికయందు ప్రచురించిరి.

అనంతర కాలమున ఫాయిల్ బ్రదర్సు కంపెనీని సెకెండుహ్యాండుపుస్తకముల వ్యాపారసంస్థలలో అద్వితీయమైనదిగా చేయుటకు బోణీఅయిన ఆ తొలుతొటి ప్రకటనను ప్రచురించిన పత్రిక పవిత్రనామము ఇపుడు లభ్యమగుటలేదు. లభ్యమే అయి ఉన్నచో అది సహస్రజిహ్వలతో శ్లాఘింపతగినది.

ఆపత్రిక ఒక్కటియే శ్లాఘింపతగినది కాదు. అందలి ఫాయిల్ బ్రదర్సు ప్రకటనములోని వాక్యములును విశేష శ్లాఘనీయములే. ఆ ప్రకటనపత్రిక బంగారు రేకులతో పొదుగఁబడి బంగారుచట్రముతో కట్టఁబడి నేటి ఫాయిల్ బ్రదర్సువారి కరిక్రొత్తమందిరమున వ్రేలాడతీయఁదగినది.

ఆ ప్రకటనయే ఆ ఫాయిల్ బ్రదర్సు కంపెనీకి ప్రారంభోత్సవము కావించినది; ఆ ఫాయిల్ సోదరుల జీవితమునకు శుభారంభము, స్థిరమైన నడవడి కల్గించినది; ప్రపంచమునందలి సెకండుహ్యాండు గ్రంథముల వ్యాపారసంస్థలలో అద్వితీయమైన ఫాయిల్ బ్రదర్సు సంస్థకు మాతృస్థానమైనది. ఆ ప్రకటన ఎంత ప్రశస్తమైనది ! ఎంత పవిత్రమైనది !

ఆ ఒక్క ప్రకటనకే ఎన్నియో ఎంక్వైరీలు వచ్చినవి. ఆ బాలురదగ్గఱ ఉన్న పుస్తకములకు మూడురెట్లు పుస్తకములున్నను ఆ తరుణమున వారు అమ్మివేసిఉందురు.

కాగా—వారికి మారుబేరమునకు సెకండుహ్యాండు పుస్తకములు కొని ఏల తిరిగిఅమ్మరాదు అని తోఁచెను. తోఁచుట తడువుగా వారు అట్టివ్యాపారమునకు దొరకొనిరి. ప్రకటనమీఁద ప్రకటన. పెద్దమార్కెట్టు ఏర్పడెను. అవకాశ

మును అందుకొని శీఘ్రగతిని అభివృద్ధిని పొందుటలో వారు అప్రమత్తులై మెలఁగుచువచ్చిరి.

వారి ప్రథమ వ్యాపార కార్యస్థానము ఏది? వారి ఇల్లే. వారుకొనిన సెకండుహాండు పుస్తకములను వారు వారి వంట యింటియందే స్టాకుచేయువారు.

వారి వ్యాపారము గోగుకాడవలె అతిశీఘ్రగతిని అభివృద్ధినందెను. కాఁపురమునకు, వ్యాపారమునకు ఆ ఇల్లు చాలినదికాదు. తమవ్యాపారముతో ఆబాలురైనను; కుండమండతో ఆ కుటుంబమువారైనను ఆఇల్లు వదలిపోవలసివచ్చెను. దినదినాభివృద్ధి గాంచుచున్న వ్యాపారమునకు ఇంటిని కార్యస్థానముగా చేయుటకంటె ఇంటిని ఇల్లుగానే ఉంచి తాము మఱియొకతావునకు తరలిపోవుటకే ఆబాలురు కృతనిశ్చయులైరి.

పెక్‌హామ్ అనుపేటయందలి ఒక చిన్నదుకాణమును వారు అద్దెకు పుచ్చుకొనిరి. ఈ పుచ్చుకొను కార్యకలాపమును వారు పోస్టుద్వారా జరిపించుకొనిరి. పోస్టుద్వారా జరిపించుకొనుటయే మేలైనది.

ఏమన? ఆసోదరుల ఇరువురిలో ఒక్కనికికూడ అప్పటికి మైనారిటీ దాఁటలేదు. పెద్దవానికి అప్పుడే పదునెనిమిదవ సంవత్సరము వచ్చెను. మెజారిటిరాని కుఱ్ఱవాళ్ళతో ఇంటి యజమాని అద్దెకంట్రాక్టు ఎట్లు కావించుకొనును?

కావుననే అద్దెకాంట్రాక్టు ఏర్పాటు పోస్టులో కావించుకొనుట మేలే ఐనదనుట.

ఈ కొట్టుకు ప్రక్కనే వేఱొకతావున వారు ఒకచిన్న గది అద్దెకు పుచ్చుకొనిరి. ఆగదియందు ఆ సోదరులు ఇరువురును తమ పడుకకు ఏర్పాట్లు చేసికొనిరి. వారి జీవితమున

వారు చేయవలసిన ప్రధానమగు పనికి వారు నిశ్చలారంభులైరి.

దుకాణమునకు వెనుకతట్టున వారు తమవంట తామే చేసికొనువారు. పనిచేయుటలో వారికి పగలు రాత్రి అను వివక్ష లేకుండెను. ఆదివారపుపూటయైన సెలవుకొనుట ఎట్టిదో వారు ఎఱుఁగరు.

వ్యాపారము ఇట్లు ఒక్క సంవత్సరము సాగినది. అప్పుడు వారికి దానిని మిక్కిలి పెద్దపెట్టున నడుపవలెనను కుతూహలము అగ్గలమయ్యెను. అందులకు వారు లండన్ మహానగరమునందు ఛారింగ్ క్రాస్ రోడ్ చెంత ఒక పెద్ద దుకాణమును బాడుగకు తీసికొనిరి. ఏడాదికి అఱువదిపౌనుల బాడుగ పైగా మునిసిపల్ పన్నులు మున్నగునవి వారే భరింపవలయును.

అప్పటి వారి తాహతుకు అది సాహసకార్యమే అనవలయును.

ఏమన—

వారికి ఆ అదనున ఎన్నియో క్లిష్టసమస్యలు బృహద్రూపమున పొడసూపెను. వారి దుకాణపు మొదటి అసిస్టెంటు ఏఁబది పౌనులు కొల్లుకవేసి పారిపోయెను.

ఐనను ఫాయిల్ సోదరులు పురులోడక సాహసించి ముందడుగు వేసిరి.

దుకాణమున మఱియొక అసిస్టెంటును నియమించిరి. ఈ రెండవఅసిస్టెంటు సమర్థుఁడును, సద్భావుఁడును. అతఁడు పదు వత్సరములు ఆకంపెనీ అభివృద్ధికి చీమునెత్తురులు వెచ్చించెను.

నేఁడు ఆ ఫాయిల్ సోదరులకు ప్రపంచమునందలి అన్ని ప్రాంతములందును కాతాదారులు కలరు. పుస్తకములకు ఆర్డర్లు ఇచ్చుజాబులు ఆ కంపెనీవారికి దినమునకు రెండువేలకు

పై(బడియు, ఐదు వేలకు లో(బడియు వచ్చుచుండెను.

దినమునకు వచ్చు ఆర్డర్లు కనీసము రెండు వేలు! వంట యింటిలో ప్రారంభమైన ఆ చిన్న వ్యాపారమునకు ఇది ఎంతటి అభివృద్ధి!

విజ్ఞానసంపాదన కాంక్ష అగ్గలమై ఉండియు క్రొత్త పుస్తకములను కొనుక్కొనలేని ఎందఱకో ఫాయిల్ సోదరుల నాటి సెకండుహ్యాండు పుస్తకములు విజ్ఞానభిక్ష పెట్టినవి, పెట్టుచున్నవి. ఆకంపెనీ ఒక పెద్ద విశ్వవిద్యాలయమువలె విద్యా వ్యాప్తికి ఎంతయో తోడుపడుచున్నది.

౧౯౦౯-వ సంవత్సరమున ఆ కంపెనీవారు అద్దెఇండ్లను విడనాడి స్వగృహము నిర్మించుకొని అందు ప్రవేశింపఁగల్గిరి.

సెకండుహ్యాండు పుస్తకములను కొని మారుబేరమునకు అమ్ము కంపెనీవారి స్వగృహము ఎట్టిదిగా ఉండునో మీరూహింపఁగలరా?

ఆ కంపెనీవారి మందిరమునకు ఆఱు అంతస్థులు. ఆ మందిర వైశాల్యము ముప్పది వేల చతురపుటడుగులు. అందు ఏకకాలమున ఇరువదిలక్షల గ్రంథసంపుటములు భద్రపఱచుటకు ఏర్పాట్లు కలవు. అమ్మకమునకైన సెకండుహ్యాండు పుస్తకములను ప్రదర్శించుటకు విశాలమగు గదులు. ప్రఖ్యాత గ్రంథకర్తలు వచ్చి ఉపన్యాసములు ఇచ్చుచుండుటకు ఒక పెద్దహాలు.

తమకంపెనీ స్థాపించిన ఇరువదియైదేండ్ల అనంతరము ౧౯౨౯-వ సంవత్సరములో ఫాయిల్ సోదరులు తమకంపెనీ రజతోత్సవమును కావించుకొనిరి.



## ౪

# లూథర్ బర్ బ్యాంక్



అతఁడు గింజలు లేని గంగరేఁగుపండ్లు కాపించినాఁడు; ముండ్లు లేని బొమ్మజెముడు జాతిని తయారుచేసినాఁడు ; చప్పని పండ్లనుకాయు చెట్లజాతులను మధురఫలములు కాయువానిగా మార్చినాఁడు ; నిర్గంధకుసుమములకు శాశ్వతముగ సుగంధము హత్తించినాఁడు ; పుట్టురంగులు పోకార్చి పూవులకు క్రొత్తరంగులు ఇచ్చినాఁడు ; తాను కనుఁగొన్న ఏదు క్రొత్త మొక్కలను ఆతఁడు ఒకసారి పంద్రెండువందల పౌనులకు విక్రయించినాఁడు.

మొక్కల విషయమున ఆతఁడు నిజముగా సాటి, మేటి లేని మంత్రగాఁడు. వనప్రతిష్ఠ సప్తసంతానములలో ఒకటిగా పరిగణించు భారతీయులకు ఆ సుప్రసిద్ధపాశ్చాత్యవనపాలకుని చరిత్ర పఠనార్హమైనది.

చరిత్రకు అందిన ప్రపంచవనపాలకులలో అంతటివాఁడు మఱిలేఁడు. ఆతని పవిత్రనామము లూథర్ బర్ బ్యాంక్.

వృక్షములలో, కూరగాయలలో, ఫలములలో ఆతఁడు క్రొత్తరకములు పెక్కింటిని ఉత్పాదించినాఁడు. ఇన్ని క్రొత్త రకములను పుట్టించిన వనపాలకుఁడు ప్రపంచమున మఱియొకఁడు లేఁడు. ఆతఁడు తనఉద్యానవనమునే తన అధ్యయన గ్రంథముగ ఒనర్చుకొన్నాఁడు.

ఆతఁడు పెక్కువత్సరములకు పూర్వము కాలిఫోర్ని

యాలో మరణించినాఁడు. ఏ తోఁటయందు నలుబది వత్సర ములు ఎడతెగక పరిశ్రమచేసినాఁడో ఆతోఁటయందే ఆతనిని ఖననముచేసినారు.

ఆతఁడు విదేశయాత్రలు కావింపలేదు. తనతోఁట యందే సర్వవేళల నివసించువాఁడు. తనతోఁట కట్టువచాఁటి కాలు అవతలపెట్టి యెఱుఁగని ఆవనపాలకుని నామముమా త్రము పలుదేశములందలి వేలకొలఁది ప్రజలకు సుపరిచయమై ఉన్నది.

అతఁడు మిక్కిలి మంచివాఁడు; ఎంతయు ప్రేమింపఁ దగినవాఁడు ఐఉండెను. డెబ్బదిఏడేండ్లు నిండిన నిండువృద్ధా ప్యమునకూడ ఆతని హృదయమున తారుణ్యము తరళాడు చుండెను. ఆతని జీవితకాలమంతయు ఆనందోద్రేకముతో, ఉత్సాహాతిశయముతో ఉద్వేలితమై ఉండినది.

అతని చింతన సృష్టికి పెడదైనదికాదు. ఆతని ఆలో చన ఎల్లవేళల నిర్మాణముతో కూడినది. ఆతని జీవితము మూలముగా ప్రపంచము పెక్కుభంగుల భాగ్యవంతమైనది; పలుతెఱఁగుల సుఖవంతమైనది.

ఇల్లు, తోఁట—వీనియందు బర్ బ్యాఁక్ నకు అభిమా నము మెండు.

ఇఁక ఆతనికి ఆతనితోఁటయే సర్వస్వమును. పూవులు, బిడ్డలు—అన్నిటికంటె ఎక్కువగ వీనిని ఆతఁడు ప్రేమించు వాఁడు.

మొక్కలను పెంచి పెద్దవానిని చేయుటలో ముఖ్యమై నది చుట్టుపట్టుల వాతావరణమేనని అతఁడు చేయెత్తి చెప్పు వాఁడు. పెరుఁగుచున్న ప్రదేశమును, ఉండియున్న వాతావర

ణామును మార్చితిమేని మొక్క కూడ తప్పక మారిపోవును.

శీతలప్రదేశమున పెరుగు దేవదారువృక్షములకు ఆకులు వానిపై బడు మంచును జారిపోవుటకు వాడిమొనలు కలవిగా ఉండును. ఉష్ణప్రదేశములందు పెరుగు తాటిచెట్టు మొదలగువాని ఆకులు తేమను చాలకాలము నిలవచేసికొనుటకు పెద్దవిగా ఉండును. ఇట్లే ఇతరవృక్షముల విషయమునను వాని నిర్మాణము అవి పెరుగు ప్రదేశములకు అనువుపడి ఉండును.

చిన్ననాటినుండియు ఆతడు డార్విన్ సిద్ధాంతములకు అంకితుడై ఉండెను. తత్త్వవేత్తలలో డార్విన్‌ను శిఖామణిగా ఆతడు ఎన్నువాడు. ప్రపంచమునంతటిని సరియైన పథమున పెట్టినవాడు డార్విన్ అని అతని తలంపు. ఆతడు గొప్పవనపాలకుడగుటకు వలసిన బోధనము అంతయు డార్విన్ వలననే కలిగినది.

బర్‌బ్యాంక్ కనుగొన్నదేమి? మొక్కల ప్రవర్ధనమున ప్రకృతిపద్ధతులు అన్నియు మెల్లనివి, చుఱుకుకానివి అని. మొక్కల ప్రవర్ధనము చుఱుకుగాచేయుట ఎట్లో ఆతడు నేర్చినాడు. వృక్షముల ప్రవర్ధనము విషయమున శీఘ్రగతికొఱకు ఆతడు ఎల్లవేళల అడ్డదారులు అన్వేషించువాడు.

ఒకసారి ఆతడు ఇరువదివేల గంగరేగుచెట్లను తొమ్మిది మాసములలో బట్వాడాచేయుటకు ఆర్డరు తీసికొన్నాడు. సకాలమున ఆ ఆర్డరు బట్వాడాచేసినాడు.

ఏజాతి చెట్లలోకాని క్రొత్తరకములను తయారుచేయు అతని పద్ధతి ఇట్టిది: పెంచి ఎంచుట—ఎంచి పెంచుట.

మొదట ఆతడు పదివేల కొమ్మలనుకాని, గింజలనుకాని నాటును. వాని ప్రవర్ధనము లెస్సగ పరీక్షించును.

ఆ పదివేల మొక్కలలో మిగిలినవానికంటె ఏపుగ పెరిఁగినది తనదృష్టిని పడినతోడనే దానికి ఆతఁడు ఒకసన్నని గుడ్డపేలిక కట్టును. ఇట్లే ఆతఁడు ఆరాశిలో ఏపుగ ఎదిగిన మొక్కలను ఏంచును. ఆ పదివేల మొక్కలలో ఏపుగ ఎదిగి ఆతని వరణమునకు అందునవి సాధారణముగ ముప్పదింటికి మించి ఉండవు.

ఎంచగా మిగిలిన మొక్కలను అన్నిటిని ఆతఁడు నాశనము చేయును. తాను ఎంచిపెంచిన మొక్కల కొమ్మలను కాని, గింజలనుకాని తిరిగినాటి వానియందుకూడ మంచివానిని ఎంచి మిగిలినవి త్రుంచివైచును. అనుకొన్న సంఖ్యకు ప్రశస్తమగు మొక్కలు లభ్యమగువఱకును ఈతీరు సాగుచునే ఉండును.

ఏపుగా ఎదిగిన మూఁడు లేక నాలుగు మొక్కలను ఎంచుకొనుట— సాధారణమైనవానిని పెఱికివైచుట— మేలైన మొక్కలనుండియే విత్తులను కైకొని పెంచుట— ఇది ప్రయోజనకరమును, ఫలకరమును అయిన ఆతని పద్ధతి.

పెంచి ఎంచుట! ఎంచి పెంచుట! తోఁటలలోనే కాదు ఈ పద్ధతి ఫ్యాక్టరీలయందును, పెద్దపెద్ద దుకాణములయందును కూడ అనుసరింపఁదగినది. పనికి జీతగాళ్ళను పెట్టుకొను ప్రతి యజమానియు తనపనివాళ్ళలో సమర్థులను ఎంచుకొని వారికి అధికప్రోత్సాహము ఇచ్చుటకు సర్వవేళల సంసిద్ధుఁడై ఉండవలయును.

మాఱుశక్తి మొక్కలకు ఉన్నదని ఆతఁడు కనుఁగొనినాఁడు. మొక్కలు అన్నియు ఒకేమాదిరివి కావు. వివిధములగు ప్రదేశములకు, వివిధములగు శీతోష్ణస్థితులకు అవి అనువు

పడఁగలవు. ఇట్లు అనువుపడుట ప్రకృతికే వదలుచో కొంత ఆలస్యము జరుగును. కాని బర్‌బ్యాంక్ మొక్కలు ఇట్లు అనువుపడుట చులుకుగా జరుగునట్లు చేయకలిగినాఁడు.

మామూలు బటానీ గింజలకంటె చిన్నవైనవి, తియ్యనైనవి అగు గింజలనుకాయు క్రొత్తమోస్తరు బటానీ తీఁగెలను ఎనిమిది ఏండ్లలో తయారుచేయుటకు అతఁడు ఒకసారి ఒక ఆర్డరు తీసికొనెను. ఎనిమిదిఏండ్ల గడువుగల ఆ ఆర్డరును మూఁడేండ్లలోనే అతఁడు పూర్తిచేయ కలిగెను.

ఆజాతి బటానీతీఁగెలు కాయుగింజలే ఇపుడు వాని జనకుఁడగు బర్‌బ్యాంక్ పేరిట 'బర్‌బ్యాంక్ ఎంప్సన్ పీ' అను నామముతో ప్రపంచప్రఖ్యాతిని అందినవి. డబ్బాలలో నిలవ చేయఁబడి ప్రపంచమునందంతటను ఇపుడు విరివిగ వాడఁబడుచున్న బటానీగింజలు ఈజాతివే.

నెక్టారిన్ అను ఫలమును అతఁడు తన విశేషకృషిచే అమృతమధురముగ ఒనర్చినాఁడు. ఇందుకొఱకు అతఁడు పండ్రెండు సంవత్సరములు—నిండుపుష్కరకాలము—శ్రమించినాఁడు; పండ్రెండువందల పౌనులను వెచ్చించినాఁడు. పూర్వపు నెక్టారిన్ ఫలముకంటె బర్‌బ్యాంక్ కనుఁగొన్నది పెద్దదిగా, హెచ్చురసము కలదిగా, ఎక్కువ సువాసన కలదిగా ఉండియున్నది.

జపానుదేశమునందలి పట్టు పారిశ్రామికుల ప్రత్యేక ప్రార్థనముపై అతఁడు ఒకక్రొత్త మాదిరి పూతిక (మల్బరీ) వృక్షమును తయారుచేసినాఁడు. మామూలు పూతికవృక్షముకంటె ఈక్రొత్త పూతికవృక్షమున ఆకులు హెచ్చు. దాదాపు రెట్టికిరెట్టి ఉండును, ఈ పూతిక ఆకులను తినియేకద

పట్టుపురుగులు పెరుగునది ? ఇదివఱకు రెండుచెట్లకు కలిపికొని ఉండనన్ని ఆకులు ఇపుడు ఒకేచెట్టున ఉంటున్నవి. ఇది పట్టు పురుగులను పెంచువారికి ఎంత లాభకరమైనది !

గింజలులేని పండ్లను కాయు క్రొత్తరకపు గంగరేగు చెట్లను అతఁడు ఉత్పత్తిచేసినాఁడు. ఇట్లు ఉత్పత్తిచేయుటకు అతఁడు గంగరేఁగుచెట్లతో మొత్తముమీఁద ఇరువదియైదు వేల శోధనలుచేసి చూచినాఁడు. ఈ పరిశోధనల ఫలముగా అతఁడు ముప్పది క్రొత్తరకముల గంగరేఁగుచెట్లకు ఉత్పాదకుఁడు అయ్యెను.

అతఁడుచేసిన కృషులన్నిటియందును కష్టతరమైనది : ముండ్లులేని బ్రాహ్మజెముడును తయారుచేయుట. బ్రాహ్మజెముడు చక్కని పశుగ్రాసము. కాని దానిముండ్లు అది పశుగ్రాసముగా ఉపయోగింపఁబడుటకు పెద్ద యడ్డుగా ఉండెను. ముండ్లు లేని బ్రాహ్మజెముడు జాతిని పుట్టింపఁగలుగుచో లోకమునకు ఉపకారకమగుటను అతఁడు గుర్తించినాఁడు.

అఱువందల బ్రాహ్మజెముడు జాతులను నాటినాఁడు. వానినిగూర్చి పదునాఱువత్సరముల దీర్ఘకాలము పరిశోధనలపై పరిశోధనలు కావించినాఁడు. తుదకు అతఁడు సంకల్పసిద్ధుఁడు ఐనాఁడు. ముండ్లులేని బ్రాహ్మజెముడును ఉత్పాదించినాఁడు.

మొక్కలన్నిటిలో బ్రాహ్మజెముడు మొండిదైనది. ఎట్టి నేలలలో కాని, ఎట్టి శీతోష్ణస్థితిలో కాని అది బాగుగా పెరుఁగును.

మొక్కలలో గులాబీని పెంచుట ఎంతకష్టమో దీనిని పెంచుట అంతసులభము. ఈ విషయమున గులాబీకి ఇది పూర్తిగా విరుద్ధమైనది. అతిసుకుమారమైన గులాబీని పెంచు

టకు అతిజాగ్రత్త వలయు. ఒకగులాబీ కొమ్మను కోసి నేలపై పడవేయుము. అది కొంచెముసేపటిలోనే వాడిపోయి ముడుచుకుపోయి చనిపోవును. కాని బొమ్మజెముడు అట్లుకాదు. బొమ్మజెముడుమట్టను ఎచ్చటనైన పడవేయుము. అది చావదు. వ్రేళ్ళను పాతించును. బర్‌బ్యాంక్ ఒకసారి బర్‌లాప్‌తో కప్పఁబడి ఉన్న బీరువాపై బొమ్మజెముడు మట్టను ఒకదానిని పడవైచెను. ఆమట్ట బర్‌లాప్‌గుండా గోడపొడుగునను నేలకు వ్రేళ్ళు పారించెను.

స్వభావసిద్ధముగ రుచిలేని ఫలములకు అతఁడు తనవిశేషకృషిచేత క్రొత్తరుచిని కల్గింపఁగల విధానమును కనుఁగొన్నాఁడు. ప్రకృతిసిద్ధముగ వాసనలేని పూవులకు అతఁడు తన తీవ్రపరిశోధనవలన సువాసన కల్గింపఁగల పద్ధతిని కనుఁగొన్నాఁడు. స్వభావసిద్ధముగ వికారవర్ణములుకల కుసుమములకు ఆకర్షణీయములును, మనోహరములును అయిన క్రొత్తరంగులు హత్తింపఁగల తీరులను అతఁడు తన అపూర్వశోధనలవలన కనుఁగొన్నాఁడు.

ఏర్చుట, పెంచుట, తిరిగిఏర్చుట, తిరిగిపెంచుట మున్నగు కార్యవిధానమువలననే అతఁడు మొక్కల విషయమున ఈ వింతమార్పులను కల్గింపఁగలిగినాఁడు. మొక్కలకు అదియొక ప్రత్యేకమగు తరిఫియతు.

ఆతనితోఁట మొక్కలకు నిజముగ ఇంద్రజాలపుశాల. ఆతోఁటమీఁద ఆతనికి మంచి వరుమానముండెను. ఒకానొక క్రొత్తరకపు మొక్కలను అతఁడు ఒకసారి పంద్రెండువందల పౌనులకు విక్రయించినాఁడు. పెద్దపెద్ద కంట్రాక్టులను ఎన్నియో తీసికొని దివ్యముగ నిర్వహించినాఁడు. అగుఁగాక! ధనార్జన

ముపై ఆతఁడు ఎప్పుడును ప్రత్యేకదృష్టిని నిలిపినవాఁడుకాఁడు.

మొక్కలపెంపకము విషయమున తాను నూతనముగా కనిపెట్టిన పద్ధతులను పిల్లలను పెంచుటయందును, వారిని తరిఫియతు చేయుటయందును ఉపయోగింప ఆతఁడు తన వృద్ధాప్యమున ఉవ్విళ్ళూరినాఁడు. మాతసంబంధమగు సంకుచితదృష్టిని ఆతఁడు కక్కసించుకొనువాఁడు. నేఁటి పాఠశాలలయందలి విద్య బాలుర మానసికశక్తులను తినివేయునదిగా ఉన్నదని నిరయించి ఆతఁడు తీవ్రముగ నిరసించువాఁడు.

ఆతఁడు మఱియొక పదిసంవత్సరములకాలము బ్రతికి ఉండుచో ఒక నూత్నవిద్యావిధానమును కనుఁగొని మానవజాతిలో క్రొత్తతీరు మానవులు తయారగుటకు పునాదులువైచి ఉండును. ఈ విషయమున ఆతనికి ఉండిన తలంపులను ఇతరులు అందుకొని ఇపుడు పనిచేయుచున్నారు.

బర్బ్యాంక్ మొక్కలు ఏర్పబడి, మార్చబడి, పెంచబడునట్లే మానవులుకూడ ఏర్పబడి, మార్చబడి, పెంచబడు కాలము కొలదిలోనే రాఁగలదు.

బర్బ్యాంక్ తోఁట ఉన్నది అమెరికాయందు. ఆతఁడు చేసిన మొక్కల, విత్తుల వ్యాపారము అంతయు ఇంగ్లండు, ఆస్ట్రేలియా, న్యూజిల్యాండ్, కెనడా దేశములతో.

ప్రపంచమునందలి వనపాలకులలో ఆతఁడు మీనుమిగిలినవాఁడు; ఆతని తోఁట మొక్కల ఇంద్రజాలపుశాల.

వనప్రతిష్ఠ సప్తసంతానములలో ఒకటిగ అనంతకాలమునుండి పరిగణించు భారతీయులకుకూడ ఈ పాశ్చాత్య వనపాలకుఁడు పూజ్యలింగము కాదగిఉన్నాఁడు.

---

## ౫

# జాన్ హార్వీ కెల్లాగ్

అమెరికాయందలి బాటిల్ క్రీక్ శానిటోరియమ్ ప్రపంచప్రఖ్యాతమైనది. ఆ శానిటోరియమ్ స్థాపనాచార్యుఁడు డాక్టర్ జాన్ హార్వీ కెల్లాగ్. దాని నిర్వాహకుఁడును అతఁడే. లోకమునందలి డాక్టరులలో శక్తిసామర్థ్యములందు అతఁడు అద్వితీయుఁడనుట ఎట్టి మినహాయింపులుకాని లేని సత్యము.

తొమ్మిదివందల సంవత్సరములకు పూర్వము ఐరోపా ఖండమునందలి నార్మడీనుండి ఎత్తివచ్చి ఇంగ్లండును జయించి అచట ప్రభుత్వము స్థాపించిన విలియమ్ విజేతతోకూడ (నార్మండీ నుండి ఇంగ్లండుకు) వచ్చిన కుటుంబములలో కెల్లాగ్ కుటుంబము ఒకటి. అప్పుడు విలియమ్‌తోకూడ ఇంగ్లండుకువచ్చిన కెల్లాగ్ వంశస్థునిపేరు జాన్ కెల్లాగ్. మనడాక్టరు ఈ జాన్ వంశస్థుఁడు. అనంతరకాలమున ఈ వంశీయులు ఇంగ్లండునుండి అమెరికాకు వలసపోయిరి.

ప్రపంచమునందలి డాక్టరులలో శక్తిసామర్థ్యములందు జాన్ హార్వీ కెల్లాగ్ అద్వితీయుఁడని చెప్పిఉన్నాము. శక్తిసామర్థ్యములందేకాదు ధనసంపాదనయందును అతఁడు ఈ ప్రపంచమునందలి డాక్టరులలో అద్వితీయుఁడే. హార్లిక్సు, మెల్లిన్సు మొదలయిన తయారీ ఆహారములవంటి ఆహారములను కొన్నిటిని తయారుచేసి వానితో వర్తకముచేసి అతఁడు చేరలకొలఁది ధనమును ఆర్జించినాఁడు.

వృత్తిచే అతఁడు డాక్టరే. కాని అతనియందు వైద్యాంశ ముకంటె వ్యాపారాంశ హెచ్చు. వ్యాపారియే కాదు అతఁడు గొప్ప విద్యాప్రదాతకూడ.

అతనికి స్వతంత్రమగు ఆలోచనాశక్తి అగ్గలము. ఏవిష యమునందును అతఁడు ఇతరులతో ఆలోచించి ఎఱుఁగఁడు. తనకు తోఁచిన భావములనే కార్యరూపమున పెట్టువాఁడు. ప్రారంభించిన కార్యమును జయప్రదముగ నిర్వహించుటకు వలయు జవసత్త్వములు అతనికి ఉండినవి.

అతని జీవితకథ అభూతకల్పనలతో కూడిన వృత్తాంత మువలె ఉండును. అందరాని పొందరాని ఆదర్శమును అంది పొందుటకు అలమటించి అందిపొందిన ఒకానొక నిఱుపేద బాలుని కథతో డాక్టర్ జాన్ కథ జతపడుచున్నది.

డాక్టర్ జాన్ తల్లిదండ్రులు వ్యవసాయమువలన జీవ నము చేయుచుండినవారు. వారి వ్యవసాయక్షేత్రము ముక్కా రును పండెడు కేదారక్షేత్రము కాదు. వట్టి గొడ్రాళ్ళదిబ్బ. అదియు కొద్దిపాటిది కాని విస్తీర్ణమైనది కాదు. డాక్టర్ జాన్ పుట్టుక అట్టిచోట.

అతనికి పదునాలుగేండ్లు నిండగా తనపొట్టకు తానే సంపాదించుకొనవలసినవాఁడు అయ్యెను. కాగా ఆ గ్రామపాఠ శాలలో అతఁడు ఉపాధ్యాయవృత్తిని స్వీకరించెను.

అతనికి పుస్తకపఠనాభిలాష అగ్గలము. అతని విశే షాభిమానమును చూఱకొనిన గ్రంథకర్తలలో రోమక వేదాంతియగు సెనికా తొలుత పేర్కొనతగినవాఁడు. సెనికా వేదాంతియొక్క సుభాషితములలో—సత్యాన్వేషణము కావిం

పుము, సత్కార్యములు ఒనరింపుము— అనునది అతనికి బాగుగా నచ్చినది.

పదునాలుగేండ్ల బాలుఁడు. చేతిలో చిల్లిగవ్వ లేదు. నేర్చినవిద్య విశేషమైనది కాదు. అప్పుడు అతఁడు చేయుచున్న పని ఒకచిన్న పాఁతకొంపలో పదిపండ్రెండుగురు పిల్లకాయలను పోగుచేసి వారికి అక్షరములు నేర్పు బడిపంతులు ఉద్యోగము.

అట్టివాఁడు రోమక మహావేదాంతియగు సెనికాయొక్క మహావాక్యరత్నమగు 'సత్యాన్వేషణము కావింపుము, సత్కార్యములు ఒనరింపుము' అను దానిని తనజీవితమున ఆదర్శముగా చేకొనుట వింతగా ఉండకమానదు.

మఱియు అతఁడు ఆ ఆదర్శమును కైకొనుసరికి మిక్కిలి బలహీనుఁడై ఉండెను. పైగా ఊపిరి సలుపనీయని క్షయరోగముతో ఉక్కడఁగి ఉండెను. అతఁడు పెరిఁగి పెద్దవాఁడు అగుట నమ్మరానివిషయమని అతనికి జన్మమిచ్చిన తల్లిదండ్రులే నమ్మి ఉండిరి.

కాగా సెనికా వేదాంతి వాక్యమును అనుసరించి ఆ కెల్లాగ్ యువకుఁడు తన ఆరోగ్యవిషయమున ముందుగా సత్యాన్వేషణము కావించుటకు దొరకొనెను. తన శరీరమును ఆ మూలచూడము అతఁడు పరీక్షకావించుకొనెను. ఒకవైద్య కళాశాలకు పోయి అందు చేరెను. అర్ధకాలమున వైద్య విద్యను పూర్తికావించి అతఁడు డాక్టర్ ఆయెను.

అతఁడు క్షయరోగమును పూర్తిగ కుదుర్చుకొనెను. ఎట్లు? ఆరుబయట పండుకొని నిద్రించుట అలవాటుచేసికొనుట చేత. సన్ లైట్ సబ్బుల వర్తకమున విశ్వవిఖ్యాతికాంచిన లీవర్ హ్యూమ్ వలెనే డాక్టర్ జాన్ హార్వీ కెల్లాగ్ కూడ ఏఁబది

సంవత్సరముల నిండాలు కాలము ఆరుబయటనే నిద్రించువాడు. ఆరుబయట అనగా కొందఱివలె ఆతడు తలవాకిటి వసారా అనికాని, ఇంటి ముంజూరు అనికాని, వరండా అనికాని అర్థము చేయలేదు. చంద్రకిరణములు, నక్షత్రకాంతులు వచ్చి నేరుగా తనను తాకు బంగనబయలున ఆతడు నిద్రించువాడు. శీతకాలములందు ఉదయమున ఆతడు లేచి చూచుకొనుసరికి తెలుపుగా అతని పక్కఅంతయు మంచుతో ముద్దయై ఉండునది.

ఏబది సంవత్సరములుగ ఆతడు ఆరుబయట నిద్రించుటయే కాదు. ఏబదిఐదు సంవత్సరములుగ ఆతడు మాంసమును దరికి చేరనిచ్చి ఎఱుగడు. పప్పుదినుసులు, ఫలములు, కూరలు మీసంకోడనే ఆతడు ప్రాణధారణము కావించుకొనువాడు. దినమునకు రెండుసారులు మాత్రమే ఆతడు భుజించువాడు.

ఏరోగమునకైనను ముఖ్యకారణము పెద్దపేగులందు క్రిములు ఉత్పత్తిఅగుటయే అని ఆతడు గాఢముగ విశ్వసించినాడు. మఱియు మాంసాహారమువలననే పెద్దపేగులలో క్రిములు చేరుటకు ఆస్కారము కలుగుచున్నదని అతని నమ్మకము.

డాక్టర్ కెల్లాగ్ ఆహారవిషయమున విశేషపరిశోధన కావించెను. హార్లిక్సు, మెల్లిన్సు మున్నగు తయారీ ఆహారముల విషయమున తీవ్రపరిశోధనలుసలిపి ఆతడు ఒక క్రొత్తరకము తయారీ ఆహారమును కనుగొనెను. కనుగొనుటయే కాదు. దానిని వ్యాపారవిధానమున విరివిగా ప్రకటించి విశేషవిక్రయము సాగించి విస్తారధనమును ఆర్జించెను.

విస్తారధనమును ఆర్జించెను. ఎంతటు ఆర్జింపలేదు ?

అది ఒకవిశేషముగా చెప్పనేల! ఇతర ధనస్వాములవలె డాక్టర్ కెల్లాగ్ ధనమునకు కాఁపున్న దయ్యముకాలేదు. తన ధనరాశికి ఉచితోపయోగ్యవృత్తిని కలిపించినాఁడు.

ఎట్లు? అత్యాశ్చర్యకరమైన ఆరోగ్యదేవాలయమును నిర్మించి. ఆ ఆరోగ్యదేవాలయమే బాటిల్ క్రీక్ శానిటోరియమ్ అను పవిత్రనామమున ప్రపంచప్రఖ్యాతిని ఆర్జించినది.

ఆ ఆరోగ్యాశ్రమమున ఇపుడు డాక్టర్లులైననేమి, నర్సులైననేమి పదునైదువందలమంది పనిచేయుచున్నారు. పదునైదువందలమంది డాక్టరులయు, నర్సులయు పనిని కొను ఆ ఆసుపత్రి ఎంతపెద్దదై ఉండునో, పాఠకుఁడా! ఊహాకు ఏమైనను అందుచున్నదా!

౧౯౨౦-వ సంవత్సరమునాఁటికి ఆ ఆరోగ్యాశ్రమమున లక్ష నలుబదియైదువేలమంది రోగులు రోగనిర్ముక్తులు అయిరి.

సత్యముగా మారిన స్వప్నమునకు ఆ శానిటోరియమ్ ఒకసాక్షి. అసలే అమెరికాదేశము ఆసుపత్రులకు ప్రఖ్యాతి వహించినది. అట్టి అమెరికాదేశపు ఆసుపత్రులలో కెల్లాగ్ చే స్థాపింపఁబడిన బాటిల్ క్రీక్ శానిటోరియమ్ విశేషప్రఖ్యాతి వహించినది.

మఱియు ప్రపంచమునందలి అనేకమగు ఆసుపత్రులవలె అది ధననష్టముతో నిర్వహింపఁబడుటలేదు. దాని ఖర్చుకు వలయు డబ్బు దానివల్లనే వచ్చుచున్నది. ఆసుపత్రులు అన్నియు ఈమాదిరిగా ఉండుట కోరతగినది.

అయితే, కెల్లాగ్ ఆసుపత్రికి దానిఖర్చు దానివల్లనే వచ్చుచున్నదనుటచే అందలి ప్రతిరోగియు దానికి డబ్బు కట్టు

వలసి ఉన్నదని ఊహింపరాదు. అచట చికిత్సనుపొందు రోగు లలో ఎందఱో ఉచితచికిత్సను పొందుచుందురు. అయినను కెల్లాగ్ తన బుద్ధివైశద్యముచేత ధననష్టములేని ధర్మవైద్య మునకు ఆ ఆసుపత్రిని ఆవాలముచేసినాఁడు.

డాక్టర్ కెల్లాగ్‌నకు పిల్లలు అనిన అపారప్రేమ. వారి పెంపకము అతనికి విలాసకరమైనపని. తల్లిదండ్రులు ఎవరో తెలియని అనాథశిశువులను నలుబదిఇద్దఱను చేరదీసి అతఁడు వారికి అర్థము, ఆరోగ్యము ఇచ్చి విద్యావంతులనుచేసి వారి జీవనమార్గమును చక్కఁజేసినాఁడు.

రోమక వేదాంతి సెనికానుడి తానుగ్రహించిన మహా వాక్యరత్నముయొక్క ఆదర్శమును ఆచరణపూర్వకముగ ప్రద ర్శించినాఁడు. తన జీవితకాలమంతయు అతఁడు సత్యమును అన్వేషించినాఁడు, సత్కార్యములు చేసినాఁడు.

ఆ సెనికా వేదాంతి సుభాషితమే కెల్లాగ్‌ను ఇంతటి వానినిగా కావించినది. జీవితపథమున ఏదైన ఆదర్శముకొఱకు అన్వేషించుచు తారట్లాడుచుండు పాఠకులకు ఎల్లరకును జాన్ కెల్లాగ్ కొనిన ఆదర్శము తప్పక వరణీయము కాతగినది.

విశ్వసమ్మతమైనది, న్యాయబద్ధమైనది, ధర్మయుక్త మైనది అగు—సత్యమును అన్వేషింపుము; సత్కార్యములు ఆచరింపుము—అను సుభాషితముకంటె మేలైన సుభాషి తము ప్రపంచమున మఱియొకటి ఉన్నదా ?

ఎల్లరును సత్యమును అన్వేషింతురు కాక ! ఎల్లరును సత్కార్యములను ఆచరింతురు కాక !

———

౬

# బెరన్ హార్డు బారన్

ప్రపంచచరిత్రలో ఆధునికయుగము వర్తకుల యుగము. అట్టి వర్తకుల యుగమున పాదనూపిన ప్రముఖ పురుషులలో బెరన్ హార్డు బారన్ ఒకడు. నేటి సిగరెట్టు వర్తకులలో బెరన్ హార్డు బారన్ చక్రవర్తి.

అతడు మిక్కిలి తక్కువస్థితిలో నుండి పైకివచ్చినాడు. స్వయంకృషివలన పైకివచ్చిన పలువురికివలెనే అతనికికూడ వ్యాపారవిషయములో ఒకకిటుకు తోచినది. ఆకిటుకు మంచి దైనదైనది. ఆ కిటుకే అతనికి లక్షలకొలది ధనమును కూర్చి పెట్టినది.

యంత్రసహాయమున సిగరెట్టులు విరివిగా తయారుచేసి పెద్దస్కేలుమీద వానితో వ్యాపారము సాగించినవారికి బారన్ మార్గదర్శకుడు. యంత్రసహాయమున సిగరెట్లు ఉత్పత్తి చేయుటచే అతడు ఇతరులకంటె త్వరగా, ఎక్కువగా వానిని చేయగలుగువాడు.

అదియునుకాక యంత్రపద్ధతివలన శుచిత్వముకూడ లభ్యమాయినది. బారన్ సిగరెట్ల చెలామణీకి శుచిత్వము ఒక మంచికారణము ఐనది.

అయినను మొదట ఇతరసిగరెట్టు వర్తకులు దీనిని గమనించలేదు. బారన్ రాకవలన తమవర్తకమునకు ఎట్టినష్టము కాని ఉండదని వారు భావించిరి. కాని క్రమముగా యంత్ర

ములలో తయారైన సిగరెట్లనే అందఱును కొనఁజొచ్చిరి;

లండన్ మహానగరములోని బ్రహ్మాండమగు అతని ఫ్యాక్టరీ అతని సంపదకు, దీక్షకు, పరిశ్రమకు మొక్కవోని నిదర్శనము.

వ్యాపారనిర్మాణవిషయమున అతఁడు సాటిలేనివాఁడు. బారన్ చేరలకొలఁది విత్తము ఆర్జించినాఁడు. ఆర్జించుటయందే కాదు, దానముచేయుటయందును అతఁడు అసదృశుఁడే. దానములక్రింద అతఁడు అతని జీవితకాలమున ఇరువది లక్షల పౌనులను వెచ్చించినాఁడు. మరణకాలమున మఱియొక ఇరువది లక్షల పౌనులను దానముచేసినాఁడు.

ఇంతటి విశేషధనమును దానముచేయుటకు అతనికి అవకాశము కల్పించిన వ్యాపారసంస్థ నామము కార్రిరాస్ లిమిటెడ్ అని. ఆ కంపెని చాలకాలమునాఁటిది. అది స్థాపింపఁబడినది ౧౭౮౮ లో.

జోస్ జోక్విన్ కార్రిరాస్ అను పేరుగల స్పానిష్ దేశీయుఁడు ఒకఁడు లండన్ నందలి రీజెంటువీధిలో ఒక పొగాకు దుకాణమును పెట్టెను. అప్పుడు మూఁడవజార్జి చక్రవర్తి పరిపాలించుచుండెను.

స్థాపించిన కొద్దికాలమునకే కార్రిరాస్ దుకాణము మంచిపేరు సంపాదించి దినదినమును పెక్కుమంది ఖాతాదారులను ఆకర్షించుచువచ్చెను. గొట్టములో వైచుకొని పొగ పీల్చుటకైన పొగాకుపొడిని ఆ కంపెనీవారు ౧౮౬౭-వ సంవత్సరమునుండి అమ్ముట ప్రారంభించిరి. ఆ పొగాకుపొడిని ఇతరవస్తువులతో కలిపి కమ్మగ తయారుచేసినది ఎరల్ ఆఫ్ క్రేవెన్. ఆ పొడి ఇప్పటికిని అతని పేరనే అమ్మఁబడుచున్నది.

౧౯౦౩-వ సంవత్సరమున ఈ వ్యాపారము బెరన్‌హార్డు బారన్ చేతులలోనికి వచ్చెను. నాఁడు మొదలు అది కొద్దిసంవత్సరములలో బెరన్‌హార్డు బారన్ ప్రతిభవలన అతివిస్తృతి అందెను.

సిగరెట్లు తయారుచేయు యంత్రములను లోపరహితము, సమగ్రము అగు స్థితికి తెచ్చిన బుద్ధిశాలి గొప్పగారుడు బెరన్ హార్డు బారన్. ఆతనికంపెనీ తయారుచేయు సిగరెట్లు నేఁడు ప్రపంచమునందలి మారుమూల ప్రదేశములందుకూడ అమ్మఁబడుచున్నవి.

అయితే ఆ వణిక్పుంగవుఁడు చేసినపనుల అన్నిటిలో బ్రహ్మాండమైనపని నవీనపద్ధతులలో లండను మహానగరమున ఒక సిగరెట్ల ఫ్యాక్టరీని స్థాపించుట. ఆ ఫ్యాక్టరీ లండన్ మహానగరపు ఉత్తరభాగమున ఉన్నది. భావికాలపు ప్రపంచ వ్యాపారవిస్తృతిని అంచనా వేయుటకు అది యొక కొలకర్రగా విరాజిల్లుచున్నది. పారిశ్రామికముగ విశేషాభివృద్ధిని అందియున్న యూరప్ ఖండములోని, అమెరికాఖండములోని మాన్యఫాక్చరర్లు అందఱును చూడఁదగిన, చూడవలసిన యంత్రాగారము అది.

ఆ ఫ్యాక్టరీ దేవాలయమువలె కట్టఁబడినది; గృహము మాదిరి నిర్వహింపఁబడుచున్నది; టంకసాలవలె డబ్బును ఉత్పత్తి చేయుచున్నది.

ఆ ఫ్యాక్టరీ వృత్తాంతమంతయు ఒక స్వప్నగత వృత్తాంతమువలె ఉండును. స్వప్నమే. కాని ఇందలి ధనము చేతికి అందును. ఆ ఫ్యాక్టరీ నూటికి ఏఁబదిపాళ్ళు లాభమును పంచుచున్నది. ఇంతకును అది ఇచ్చులాభము పై ఎట్టిపన్నుగాని లేదు.

ఆ ఫ్యాక్టరీ మందిరము బ్రహ్మాండమైనది. అది నిర్మించుటకు పదిలక్షలపౌనులు వ్యయమైనవి. లండను మహానగరములో నాలుగువీధుల నడుమను ఉన్న ఒక చతురపు ప్రదేశము అంతయు అది ఆవరించుకొన్నది. కాని దానికి పట్టియున్న సుగుణములలో విశాలరమ్యత ఒక్కటియే కాదు. దానికి గల ఇతర సుగుణములముందు విశాలరమ్యత అను సుగుణము అంతగా పరిగణింపరానిదని చెప్పకతీరదు.

ఆ యంత్రాగారమున పెక్కురకముల (బ్రాండుల) సిగరెట్లు తయారుచేయఁబడుచున్నవి. అందు నల్లపిల్లి మార్కు సిగరెట్లు ఒకరకము. ఆ ఫ్యాక్టరీ సింహద్వారమున ఇరుపక్కములందును చెరియొక నల్లపిల్లి విగ్రహమును ఉంచఁబడి ఉన్నవి.

ఆ యంత్రాగారము బయటను, లోపలను నలుపు, ఎరుపు, ఆకుపచ్చ చారలతో అలంకృతమై ఉన్నది. మందిరమునకు ఎదుట పండ్రెండు పెద్ద స్తంభములు గలవు.

రాత్రిపూట ఆ భాగమంతయు మిక్కిలి కాంతిగల విద్యుద్దీపములతో శోభాయమానము అగుచుండును. లక్షలకొలఁది పున్నమచంద్రులు అచట ప్రకాశించుచున్నట్లుండును. ఆ దీపములముందు వీధిలోని కార్పొరేషన్ దీపములు దిక్కటీముందు దీపములవలె వెలవెలఁబోవుచుండును.

గ్రేట్ బ్రిటన్ నందు రీయిన్ఫోర్స్డు కాంక్రీటుతో కట్టబడిన కట్టడముల అన్నిటికంటెను బారన్ సిగరెట్ల ఫ్యాక్టరీ పెద్దది. ఆ మందిరమున ఆరు అంతస్థులు, అఱువదియైదు లక్షల ఘనపు (క్యూబిక్) టడుగుల ఆవరణ.

మందిరములోపల ఎనుబది బ్రహ్మాండమైన యంత్రములు-

కలవు. అవి నిముసమునకు వేయివంతున సిగరెట్లను తయారు చేయుచుండును. మూఁడు వేలమంది కార్మికులు. అందు పెక్కుఱు సుందరవదనములతో ఒప్పారు కన్యలు. సాధ్యమైనంత సులభముగను, కూడినంత ఆనందకరముగను చేయఁబడిన అచటి పనిని ఆ మూఁడు వేలమంది నిర్వహించుచుందురు.

ఆ కంపెనీ డైరక్టర్లు సమావేశమగు మందిరభాగము అతిసుందరమైనది. అది దేవతలకుకూడ చూడఁదగిన స్థలము. అంతటి సుందరమందిరము భాగ్యవంతమైన బ్రిటిష్ దీవులయందే మఱియొకటి లేదు. నలుపు, ఎరుపు, ఆకుపచ్చ రంగులతో అలంకృతమై అదియొక ఉన్మీలితచిత్రమువలె ఉండును. కొమ్ములుగల దీపస్తంభములు అందు ఆఱున్నవి. ఇవికాక అందలి గోడలయందు అలంకారదీపములు పెక్కు పైకి పాకి పట్టరానంత నైపుణ్యముతో పొదుగఁబడి ఉన్నవి. మఱి ఆ మందిరపునేల అద్దముకంటె నునుపుగా ఉండు పాలగచ్చు.

ఆ ఫ్యాక్టరీయందు అంతయు క్రొత్తపద్ధతి. సాధ్యమైనంతవఱకు ప్రతిపనియు యంత్రములే చేయుచుండును. సిగరెట్లతో నిండియుండు త్రేలను మోసికొనిపోవు యంత్రములు కొన్ని, బంగీలను కట్టుయంత్రములుకొన్ని, పొగాకును తొంబి తుంబాలక్రింద త్రుంచివేయు యంత్రములుకొన్ని, కాగితపు చుట్టను అతుకు యంత్రములుకొన్ని, డబ్బాలకు రేపర్లు అతికించు యంత్రములుకొన్ని— ఈ యంత్రములను అన్నిటిని మించినవి సిగరెట్లను తయారుచేయు యంత్రములు,

తయారుచేసిన సిగరెట్లను ఆ యంత్రములు వాయువేగమున వెలికి త్రోయుచుండును. యంత్రములనుండి బయటికి వచ్చుచుండగా సిగరెట్లను లెక్కించుట చూచినమాత్రమున

తాంద్రచెట్టునఁగల ఆకులను, ఫలములను నలునకు సరిగ చెప్పిన ఋతుపర్ణునివంటి అక్షహృదయమును ఎఱిగిన సంఖ్యానిదునకు సయితము దుస్తరమగును.

ఆ యంత్రాగారమున పని ప్రవాహవేగమైన నదిలోని జలమువలె సాగుచుండును. ఆ ఫ్యాక్టరీకి అంతటికిని రెండే ద్వారములు: లోనికివచ్చు సరకులకు ఒకటి, బయటికిపోవు సరకులకు మఱియొకటి. ఎట్టి చిందటుకాని, ఎట్టి వంచటుకాని ఉండదు. అచట అన్నియు అన్నికాలములందును యథాప్రదేశ విని వేశితములై ఉండును.

అచటి చెక్కిక్ క్రొత్తదై ఉన్నట్లే ఆరోగ్యవిధానము కూడ క్రొత్తదై ఉన్నది. దుమ్ము అన్నది ఆ యంత్రాగారమున కలికములోనికైన దొరకదు. ఎప్పటికి అప్పుడు దుమ్మును 'డస్టుఎక్స్ట్రాక్టర్లు' అను యంత్రములు వెలికి కొనిపోవుచుండును.

ఇఁక అచట వాయుదేవుఁడు ఆ యంత్రాగారపు యజమాని ఇచ్చవచ్చిన మచ్చున సంచరింపవలసినదే. అచట అప్పటికి ఎట్టి శీతోష్ణస్థితి కావలసిఉన్నదో అట్టి శీతోష్ణస్థితిని అచట యంత్రములు నిరంతరము కలిగించుచుండును. అచటి ప్రధాన వస్తువగు పొగాకుకు కావలసిన వాతావరణము (క్లయిమేటు) కూడ ఆ యంత్రాగారముననే ఉత్పత్తి అగును.

ఇట్లు శీతోష్ణస్థితిని కోరిన పరిస్థితులలో నిలిపి ఉంచు యంత్రములు ఆ ఫ్యాక్టరీలో ఉన్నన్ని యూరప్‌లోని మఱియే ఫ్యాక్టరీలోను లేవు. అఱువదివేల పౌనుల వ్యయముతో ఆ యంత్రములు నిర్మింపఁబడినవి. లోనికివచ్చు గాలి అంతయు క్షాళితమొనర్పఁబడును. పిదప వేఁడిచేయఁబడును. పిమ్మట

చెమ్మగిలునట్లు చేయఁబడును. శీతకాలము అగుఁగాక, వేసవి అగుఁగాక ఆ యంత్రాగారమున లోనగాలి ఒకేమోస్తరుగ ఉండును. నడిశీతకాలమగు జనవరిమాసమున సయితము ఆ ఫ్యాక్టరీయందలి పనికత్తెలు చేతులకు ఎట్టి దుస్తులను ధరింపకయే పనిచేయుచుందురు.

అచటి వాయువు స్వచ్ఛమైనది, శుచియైనది. పల్లెపట్టులందు దివ్యభవనములలో నివశించు భూస్వాములకు సయితము అందుబాటున ఉండుటకు అసంభవమైన గాలి ఆ ఫ్యాక్టరీయందు పనిచేయుచుండు మూడువేలమంది కార్మికులును అనుభవించుచుందురు.

నొప్పి కలుగకుండ ధనమును ఆర్జించుపద్ధతి కేడ్బరీ(?)

నొప్పి కలుగకుండ ధనమును ఆర్జించుపద్ధతి కేడ్రాసు ఘరమువారికి తెలియును. ౧౯౨౮-వ సంవత్సరమున ౧౩, ౫౮, ౮౭౭ పౌనుల లాభమును ఆ కంపెనీవారు గడించిరి. ఆ లాభము అంతయు ఒకనికి మాత్రమే చెందదు. అచట పనిచేయు ప్రతివానికిని అందు భాగముకలదు.

పలుకంపెనీలకు మేధమాత్రమే ఉండును. హృదయము ఉండదు. కాని కేడ్రాసుకంపెనీకి మేధ, హృదయము రెండును ఉన్నవి.

పనివారలక్షేమము అరయుటకు అచ్చట డాక్టర్లు, దంతవైద్యులు, నర్సులు ఉన్నారు. వ్యాధికుదిరి స్వస్థపడు సమయమున వలయు విశ్రాంతి, వినోదము కలిగించుటకు అవసరమగు సౌకర్యములు ఏర్పాటుచేయఁబడి ఉన్నవి.

ఆటలాడుకొనుటకు స్థలములు— రోగసమయమున జీతములు ఇచ్చుటకు, పనినుండి విరమించుచో ఉపకారవేతనములు ఇచ్చుటకు ఏర్పాటులు కలవు.

క్రిస్టమస్ పండుగ సందర్భమున ఏటేట ప్రతివానికిని ఒకవారము కూలి అదనముగ ఇచ్చెదరు. అపుడు ఒకపెద్దసభ జరుగును. బారన్ బ్రతికిఉన్నంతకాలమును ఆ సభకు ప్రతి వత్సరమును అతఁడే అధ్యక్షుఁడుగా ఉండువాఁడు. అధ్యక్షత వహించి ఆయేఁటి వ్యాపారచరిత్ర అంతయు చాటుమాటు లేకుండ పనివారలకు ఉపన్యసించువాఁడు.

పన్నులేకుండ నూటికి ఏఁబదిపాళ్ళు లాభమును పంచి పెట్టునట్లు వ్యాపారమును నడపఁదలఁచిన ప్రతివాఁడును అవలంబింపఁదగు సరియైన విధానము ఇదియే.

బారన్ విశేషముగ విత్తము ఆర్జించినాఁడు, విరివిగా ఆ విత్తమును దానముచేసినాఁడు. ఐనను గౌరవములకోసమును, బిరుదులకోసమును అతఁడు ఎప్పుడును ఆశించలేదు. అతఁడు చనిపోయిన పిమ్మట ౧౯౩౦-లో అతని కుమారునకు ప్రభుత్వమువారు బార్ నెట్సీ ఇచ్చినారు.

---

## ౭

# రిచ్చర్డు హెచ్. గ్రాంట్

హెన్రీఫోర్డు మోటారురాజు. అట్టి ఫోర్డుమోటారు కంపెనీకంటె హెచ్చుగా మోటారులను అమ్ము కంపెనీ మఱి యొకటి బయలుదేరినది. అది చెవ్రొలెట్ మోటారుకంపెనీ.

మోటారు ప్రపంచమున అద్వితీయుఁడే అయినను ఫోర్డు తనకారునమూనా మార్చి చెవ్రొలెట్ కారుమాదిరిగా చేయ

వలసి వచ్చినది. దానికి కారణము ఫోర్డుకారులకంటె చెవ్రొలెట్ కారులు విశేషముగ వెలకుఁబోవుటయే.

ఫోర్డు బస్సుల, కారులకంటె చెవ్రొలెట్ బస్సులు, కారులు హెచ్చుగా వెలపోవుటకును—చెవ్రొలెట్ కారులను చూచి ఫోర్డు అంతటివాఁడు తన కారుమాదిరి మార్చుకొనవలసి వచ్చుటకును కారణము చెవ్రొలెట్ మోటారుకంపెనీవారి అమ్మకపు మేనేజరైన రిచ్చర్డు హెచ్. గ్రాంట్ ప్రతిభ, పరిశ్రమ.

౧౯౨౧-వ సంవత్సరమున గ్రాంట్ చెవ్రొలెట్ మోటారుకంపెనీవారి సేల్సుమేనేజరు అయెను. నాలుగు సంవత్సరములలో అతఁడు చెవ్రొలెట్ కారుల అమ్మకమును ఐదురెట్లు అభివృద్ధికి తెచ్చినాఁడు. ౧౯౨౧ లో రెండులక్షల ఏఁబది వేల కారులు మాత్రము అమ్మఁగా ౧౯౨౫ లో పండ్రెండు లక్షల ఇరువదియైదువేల కారులు అమ్మినాఁడు.

ప్రపంచమునందలి మఱియే కంపెనీకిఁగాని ఇంతటి సేల్సు మేనేజరు లేఁడు. ఈ విషయమున అతనికీర్తి అద్వితీయమైనది. అమెరికావారికే కాని యూరప్‌ఖండమువారికి అతనిని గుఱించి విస్తారముగ తెలియదు.

అతఁడు స్కాటిష్‌జాతికి చెందిన అమెరికన్. అతని తలిదండ్రులు ధనవంతులు. హార్వర్డులో విద్యాభ్యాసము కావించినాఁడు. ఆ విద్యాభ్యాసము అతని వ్యాపారనైపుణ్యమును చల్లార్పలేదు.

మూఁడు సంవత్సరములు ఒకానొక టెలిఫోను కంపెనీలో సేల్సుమెన్‌గా ఉండినాఁడు. తరువాత నేషనల్ క్యాష్ రిజిష్టరు కంపెనీలో ఉద్యోగమునకు కుదిరినాఁడు. తొమ్మిది యేండ్లలో ఆ కంపెనీకి సేల్సుమేనేజరు అయినాఁడు.

అతని మూడవ ఉద్యోగము ఇంతకంటెను కష్టమైనది. డెల్కోలైట్ కంపెనీవారు వ్యవసాయదారులకు దీపపుసామ గ్రిని అమ్ముటకు అతనిని కుదుర్చుకొనిరి. అప్పటికి ఆ సామ గ్రిని తయారుచేయు కంపెనీలు ఏఁబది ఉండెను.

ఆ కంపెనీలు అన్నియు కలసి ఏఁడాదికి పదివేల లైటింగు ప్లాంట్లకంటె ఎక్కువ అమ్మలేకపోవుచుండెను.

డెల్కోలైట్ కంపెనీలో పనికి కుదురుసరికి గ్రాంట్కు ముప్పదిఏడేండ్లు. అతఁడు దీక్షతో పనికి పూనినాఁడు. ఏఁడాదికి తన కంపెనీవారి లైటింగ్ప్లాంట్లు ఇరువదియైదువేలు విడుదల చేయించినాఁడు.

ప్రాంతప్రాంతమునకు తాను స్వయముగ వెళ్ళువాఁడు. ఆ సామగ్రికి అవసరమును కల్పించినాఁడు. ఏఁబదిమంది ఉత్పత్తిదారులు కలసి ఏఁడాదికి పదివేల స్వరూపములు అమ్మ లేకుండిన పరిస్థితులలో తాను ఒక్కఁడు తనకంపెనీవారివి ఏఁడాదికి ఇరువదియైదువేల వస్తువులను విక్రయించినాఁడు. ఇది వ్యాపారప్రపంచమున జరిగిన ఒకగారడీ అని అనకుండ ఉండఁ గలమా!

ఈ ఉద్యోగమునకు తరువాత గ్రాంట్ ఎలక్ట్రిక్ రిఫ్రిజి రేటరులు అమ్ము కంపెనీలో చేరినాఁడు. అక్కడకూడ అమ్మ కము విషయమున అపూర్వమైన గారడీచేసినాఁడు.

అమ్మకములో అతిలోకానుభవము కలిగినది. హెన్రీ ఫోర్డు అంతవానికికూడ పై చేయికాఁగల పరిస్థితులు ఏర్పడినవి. వస్తువిక్రయమున గ్రాంట్ సంపాదించిన అపూర్వానుభవ మును ఉపలక్షించి చెవ్రొలెట్ మోటారుకంపెనీవారు అతనిని తమకంపెనీలో సేల్సుమేనేజరు ఉద్యోగమునకు ఆహ్వానించిరి.

అతఁడు ఆ ఆహ్వానమును సంతోషపూర్వకముగ చేకొనెను.

అతఁడు ఆ ఉద్యోగమును స్వీకరించిన మొదటి సంవత్సరములో (౧౯౦౨-౩-వ సంవత్సరములో) కారుల అమ్మకము అంతకుపూర్వపు నాలునకంటె రెట్టింపుఅయినది. తరువాత రెండుసంవత్సరములలో ఆవ్యాపారము తిరిగి ద్విగుణమైనది. ౧౯౦౫ లో నూటికి పండ్రెండునర వంతున అభివృద్ధిని అందినది. ఆయేఁడు గ్రాంట్ పండ్రెండులక్షల ఇరువదియైదు వేల కారులను విక్రయించినాఁడు. అప్పటికి గ్రేట్ బ్రిటన్ మొత్తము మీఁద ఉన్నకారుల సంఖ్యకంటె కూడ ఆ అమ్మకము విశేషమైనది.

ఇంత విశేషమైన అమ్మకము కావింపఁగలుగుటకు అతఁడు అపూర్వమైన పద్ధతి ఏమైన అవలంబించెనా ?

నిర్ణీతమైన పద్ధతి లేనిదే అతఁడు అసలు అమ్మకమునకే కడంగఁడు. తాపీమేస్త్రి తాను కట్టఁబోవు ఇంటిప్లాను ముందే ఎట్లు తయారుచేసికొని ఉంచుకొనునో అట్లే గ్రాంట్ కూడ తాను చేయఁబోవు అమ్మకమునుగూర్చి ముందే సర్వము ఆలోచించుకొని ఉంచుకొనును.

ప్రదర్శనము, ప్రకటన—ఇవి అతని అమ్మకపు వ్యాపారమున ప్రధానాస్త్రములు.

అమ్మువారియెడల మర్యాద—అతని నియమములలో ఇది ఒకటి.

తృప్తికల వ్యాపారులమీఁదనే అతనిదృష్టి లగ్నమై ఉండును. ఒక్కొక్క వ్యాపారికి నిర్దిష్టమైన మండలమున మఱియొక వ్యాపారి ప్రవేశించుటకు అతఁడు అంగీకరింపఁడు. ఆ వ్యాపారులుకూడ తన భాగస్వాములు ఐనట్లే అతఁడు వర్తిం

మును. వారి హక్కులను అతఁడు నిక్కచ్చిగా కాపాడును. ప్రకటనలకు, జమాఖర్చులను సరియైన స్థితిలో ఉంచుటకు, పాఁతకారులను అమ్ముటకు వారికి అతఁడు అమితముగ సాయ పడును.

వారు అమ్మఁకలిగినవానికంటె హెచ్చుసంఖ్య కారులను కొనమని ఆ వ్యాపారులను అతఁడు ఎన్నఁడును బలవంతము చేయఁడు.

అతని యాజమాన్యమున అతని కంపెనీకి నాలుగువేల ఐదువందలమంది డీలర్లు; ఐదువేల ఐదువందలమంది అసిస్టెంటు డీలర్లు ఉన్నారు. వారు అందఱును అతనికి మంచిస్నేహితులు. నెలనెలకు వారివద్దనుండి నివేదికలు తెప్పించుకొనును. పైగా తనక్రింద పనిచేయుచున్న ఏఁబదిముగ్గురు సేల్సుమెన్నును సూపర్వైజర్లుగా పంపుచు డీలర్లకు, తనకు వ్యవహారము ఎప్పటి కప్పుడే సన్నిహితము కావించుకొనుచుండును.

వ్యాపారులకు ఆ వ్యాపారవిషయమైన విజ్ఞానము కలుగు టకు ఫిల్ములు, కరపత్రములు, పోస్టర్లు, కార్డులు, పుస్తకములు సరఫరా చేయుచుండును. వ్యాపారులు ఎప్పుడుకాని పొంద కొడిలో పడక ఉత్సాహముగ ఉండునట్లు జాగ్రత వహించు చుండును. మంచి వ్యాపారముచేసినవారిని అతఁడు బాగుగ శ్లాఘించును.

'ఎల్లప్పుడు ఒక క్రమమైన పద్ధతి ఉండవలెను. అమ్మక మునకు ప్రోత్సాహ ముండవలెను.' అని అతఁడు చెప్పును.

అతని పుట్టుక ౧౮౭౮ లో. అతఁడు పొట్టివాఁడు. నెమ్మ దిగ మాటలాడును. విశ్రాంతిసమయములందు అతఁడు తనకుఁ గల మూఁడువందల యకరముల పొలములో పనిచేయుచుండును.

భూమిని చీల్చుకొని మొక్కలు పైకివచ్చి బాగుగా పెరుగుటను చూచుటకు అతఁడు కుతూహలుఁడగుచుండును.

అతని అమ్మకపుపద్ధతులు ఏ వస్తువిక్రయమునకైనను పనికివచ్చునవే. టెలిఫోను వ్యాపారమునకు, కాష్‌రిజిష్టర్ల విక్రయమునకు, లైటింగుప్లాంట్ల అమ్మకమునకు, ఎలక్ట్రిక్ రిఫ్రిజిరేటర్ల విక్రయమునకు, మోటారుకారుల అమ్మకమునకు అతఁడు ఆ పద్ధతులను వినియోగించినాఁడు.

బట్టలు, బొగ్గు, ఉక్కు, ఇనుము, ఉన్ని మొదలగు ఏ వ్యాపారమునందుకాని వానిని ఏల ఉపయోగింపరాదు ?

విక్రయమునకు ప్రత్యేకముగా కొన్ని సూత్రములు లేవనువారును, విక్రయమున దక్షత నేర్చుకొనిన వచ్చునదికాదనువారును ఈ రిచ్చర్డు హెచ్. గ్రాంట్ చరిత్రను—నాలుగు సంవత్సరములలో తనకంపెనీవారి అమ్మకపు వ్యాపారము ఐదు రెట్లు పెంచిన గ్రాంట్ చరిత్రను— చదువవలసి ఉన్నది.

గ్రాంట్ జీవితమునుండి మనము నేర్చుకొనవలసినది ఏమియు లేదని చెప్పఁగల విక్రయదారులు ఎవరైన ఉందురా?

గ్రాంట్ జీవితకథాకథనము అనగా వస్తువిక్రయ వ్యాపారరహస్యవివరణము.

ఏఁడాదికి పదుమూఁడులక్షల మోటారుకారుల విక్రయము! ఇంతటి విశేషవిక్రయము ఉండుచో ఏవస్తువును ఉత్పత్తి చేయుటయుండైనను ఉత్సాహము అతివేలముగా ఉండును.

గ్రాంట్‌వంటి విక్రేతకు నోఁచిపుట్టిన ఏవ్యాపారమైనను అచిరకాలముననే అభ్రంకషస్థాన మందును.

—•••••—

## ౮

# మారిట్జు థామ్ సెన్

పుట్టినది శీతలదేశమైనను కొంచెముసుఖ మెఱుఁగని కూటి పేద అనంతరకాలమున కోటీశ్వరుఁడై వలచిన వనితను పెండ్లాడి నాఁడు.

అడవిలో అనాసకాయలుతిని అసువులు నిలుపుకొన్న అభాగ్యుఁడు అనంతరకాలమున ఏఁడాదికి ఇరువదిమూఁడు లక్షల పౌనుల విలువగల సరకును అమ్ము బిస్కత్తుల ఫ్యాక్టరీకి కామందు ఐనాఁడు.

ఓడ ప్రయాణములందు మూఁడుసారులు సముద్రమునఁ బడిన నిర్భాగ్యుఁడు అనంతరకాలమున రోజుకు పదివేలపౌనుల పీపాలపిండిని తయారుచేయుచు ఏఁడాదికి పదుమూఁడు వేల పౌనుల లాభమును గడించు పిండిమరకు యజమాని ఐనాఁడు.

ఎప్పుడుకాని ఎందుకుకాని పనికిమాలినవాఁడై యుండునని కన్నతండ్రిచే అనిపించుకొన్న దురదృష్టవంతుఁడు అనంతరకాలమున మెక్సికోలో ఐదువందల చతురపుమైళ్ళ విస్తీర్ణముగల భూమికి ఖామందు ఐనాఁడు.

ఆతని కథ వినవలయునని మీకు కుతూహలము కలదా!

అది క్రీస్తుశకము ౧౮౬౩-వ సంవత్సరము. అప్పటికి ఆతనికి పదుమూఁడుసంవత్సరములు పైఁబడినవి. ఆతఁడు కట్టిన బట్టలు చింపిపాఁతలు. వాలకముచూడఁగా ఆతఁడు పుట్టిన తరువాత ఒక్కపూటకూడ కడుపునిండ అన్నముతిని ఎఱుఁగఁడని

ఎవరికి ఐనను తోఁచకమానదు. అతఁడు అప్పుడు స్కాట్లండు నందలి లీత్ హార్బరులోని ఒక ఓడచెంత నిలుచుండిఉండెను.

ఆ నావ సింగపూర్‌కు పోనుండెను. దానియందు తనకు ఏదైన పని ఈయవలసినదిగ ఆతఁడు ఆ ఓడఅధికారులను కడుపు కాళ్ళుపట్టుకుని బ్రతిమాలుచుండెను. ఒంటినిండ బట్టకు, కడుపు నిండ తిండికి నోఁచిపుట్టని ఆ అభాగ్యబాలుని ప్రార్థనము అంగీకరింపఁబడినదా ?

ఆతనిది ముదిరూపు. ఉన్నవి పదుమూడేండ్లే అయినను ఆతఁడు అంతకంటె చాల పెద్దవాఁడుగా కనిపించును. అప్పటికి స్కాట్లండులో ఉన్నను అతఁడు ఆ దేశస్థుఁడు కాఁడు. ఒక ఏఁడాదిక్రితము ఆతఁడు డెన్మార్కు దేశమునందలి తన ఇంటిని, తలిదండ్రులను వదలి పరారీఅయి ఇచటకు వచ్చి ఉన్నాఁడు.

ఆతని తలిదండ్రులు కటికిదరిద్రులు. అగుటనే ఆతఁడు ఇంతవఱకు తన జీవితములో ఒక్కపూటకూడ కడుపునిండ తిండి తిని ఎఱుఁగఁడు. కోటు అనునది కలిగిఉండుట ఎట్టిదో ఆతఁడు ఎఱుఁగఁడు. ఇజారు, షర్టు—ఇవే ఆతనిదుస్తులు. ఆ శీతలదేశములందు ఎట్టి దరిద్రుఁడుకాని కోటులేకుండ ఉండఁడు. ఆతఁడు ఆ కోటుకూడలేని గర్భదరిద్రుఁడు.

అట్టి గర్భదరిద్రునివద్ద—ఇంటినుండి పరారీ అయిపోవు నప్పుడుమాత్రము—ఏముండును? ఉన్నదేదో తనకుకల ఎఱ్ఱి జేబురుమాలున మూటకట్టినాఁడు. తండ్రి ఆతనిని కులము చెఱుపఁబుట్టిన చెఱుపరి అని చెంగనాడి చెడతిట్టినాఁడు; పైగా ఆతఁడు ఎప్పుడుకాని, ఎందుకుకాని పనికిమాలినవాఁడై ఉండు వని ఆశీర్వదించినాఁడు.

ఎట్టి జీవితమునకు కానిండు, ఇది శుభారంభ మను

వచ్చునా? అనుటకు వీలులేదు. కాని అతఁడు అనంతరకాలమున గొప్ప వర్తకుఁడు, విశేషధనవంతుఁడు అయినాఁడు. అతని పేరు మారిట్జు థామ్సెన్.

లీత్ నౌకాశ్రయమునుండి సింగపూర్ వెళ్ళు నావమీద అతనికి పనిఇచ్చినారు. కాని కొద్దికాలములోనే థామ్సెన్‌కు ఈపనికొఱకు ఎందుకు ప్రాధేయపడితిమా అను విచారము పట్టుకొనెను. ఆఓడ కప్తాను ఏకోశమునందును దయాదాక్షిణ్యములు లేని కొయ్య.

పైగా ఆ ఓడలో పనివాళ్ళకు ఈయఁబడు ఆహారము మాంసము లేని గొడ్డుఎముకను తమకముతో నోటకఱచుకొను కుక్కలు సయితము మూతిపెట్టి చూచుటకు ఇచ్ఛగింపకుండునంత చెడ్డది. పుట్టినప్పటినుండి కడుపునిండ తిండి తినుట ఎట్టిదో ఎఱుఁగని థామ్సెన్‌కుకూడ చూచినమాత్రమున డోకువచ్చునదిగా ఉండిన ఆ ఆహారము ఎట్టిదిగా ఉండునో పాఠకులే సులభముగ ఊహించుకొనవచ్చును.

ఓడ సింగపూర్ చేరినది. ఆ నావలో పనికొఱకు లోగడ అంతగ అలమటించిన అతఁడు ఇప్పుడు దానిని ఎట్లు వదలించుకొనుటయా అను ఆలోచనలో పడినాఁడు. మారిట్జు, మఱి పదునొకండుగురు నావికులు ఓడనువదలి సింగపూర్ చెంతగల అరణ్యములోనికి పారిపోయినారు.

ఓడకంటె అడవి వారికి అప్పుడు వాసయోగ్యమనిపించినది! అడవిలో సమృద్ధిగ దొరకిన అనాసపండ్లు, కొబ్బరికాయలు తిని ఆ పన్నిరుగురును తమప్రాణములు నిలుపుకొనుచు వచ్చిరి.

వారముదినములు కడచినవి. తాముపచ్చిన నావ ఈపాటికి

సింగపూర్ రేవును వీడిఉండునని విశ్వసించి వారు తిరిగి హాస్పిటలు వచ్చినారు. అప్పటికి హాంగ్ కాంగ్‌కు పోనున్న ఒక చిన్న ఓడమాత్రము నౌకాశ్రయములో ఉన్నది. మన మారిట్జునకు అందులో పని దొరకినది. మారిట్జు పనిగొనుచు ఆఓడ హాంగ్ కాంగ్‌నకు ప్రయాణము కట్టినది.

కాని దురదృష్టదేవత ఆతనిని ఇంకను వదలలేదు. వేయి విఘ్నములు ఐనపిమ్మటకాని విఘ్నేశ్వరునకు వివాహము కాదుకదా!

రెండురోజులు ప్రయాణముచేసినదో, లేదో ఆ ఓడను చీనా ఓడదొంగలు పట్టుకొనిరి; ఊంచముట్టుగ దోచుకొనిరి; అంతతో కసితీరక దానిని వారు ముంచివైచిరి. ఓడకొయ్య ఒకటి మారిట్జునకు దొరకినది. దానిసాయమున ఆతడు నడి సముద్రమున తేలుచుండెను. త్రాగుటకు మంచినీళ్ళు లేవు. తినుటకు తిండిలేదు.

రెండురోజులు అట్లు ఆతడు నీటిమీద పుల్లవలె తేలుచుండెను. మెక్సికోకు పోవుచుండిన బ్రిటిష్ ఓడ ఒకటి మూడవనాడు అతనిని రక్షించినది. అతని ప్రాణములు తిరిగి కుదుటబడినవి.

కాని ఆ దురదృష్టవంతుని రక్షించినందులకు శిక్షగా ఆ ఓడ తుపానుకు గురిఐనది. దాని తెరచాపలు అన్నియు చినిగిపోయినవి. గాలి తీవ్రముగ విసిరికొట్టుచున్నది. ఓడ కొబ్బరి చిప్పలాగున ఊగులాడుచున్నది.

తెరచాపలు కట్టిన ఓడకొయ్యలను దింపినకాని ఓడ నిరపాయస్థితికిరాదు. కాని ఆ ఓగుగాలిలో కొయ్యలపైకి ఎగబ్రాకి కట్టుత్రాళ్ళను తెగగోయుగల సాహసికులు ఎవరు!

మాలిమికాఁడు పనివారలను సీవా, సీవా అని అడుగుచున్నాఁడు. యువకుఁడగు మారిట్జు అప్పుడు ముందుకువచ్చినాఁడు, కట్టుత్రాళ్ళు కోయుటకు.

ఓడ కొయ్యలపైకి ఎగఁబ్రాకి త్రాళ్ళుకోసి మారిట్జు కొయ్యలు దింపినాఁడు. నావ తాజాస్థితికి వచ్చినది. ఏఁబది ఆఱు దినములు తుపానులో కొట్టుమిట్లు ఆడి తుదకు కలము హానొలులు అను రేవుస్థలమున ఒడ్డుపట్టినది.

ఇచ్చట నావలకు తెరచాఁపలు తయారుచేయువానివద్ద మన మారిట్జు పనికి కుదిరినాఁడు. ఇదియే ఆతనికి ఆనందము కూర్చిన మొదటిపని ; జీతముకూడ తృప్తికరముగానే ఉండెను. రోజుకు ఇరువది పెన్నీలు.

మారిట్జు నలుబదిపౌనులు కూడఁబెట్టి తనతండ్రిపేర మనియార్డరు చేసినాఁడు. మఱు వత్సరమున మఱియొక నలుబది పౌనులను పంపినాఁడు. ఆతని కుటుంబమునందలి వ్యక్తులు వారి జీవితకాలములో అంతటిసొమ్మును అంతకుపూర్వము ఎప్పుడుగాని చూచిఉండలేదు.

తిరిగి ఓడమీఁద ఉద్యోగము సంపాదింపవలెనని ఆతనికి కుతూహలము కలిగినది. ఈసారి ఆతనికి మంచి ఉద్యోగమే దొరకినది. కలములోని కప్తానుక్రింది రెండవ ఉద్యోగిగా ఆతఁడు కుదిరినాఁడు. ఆ ఉద్యోగమునకు ఆతఁడు ఎంతయో మురిసినాఁడు. 'ప్రపంచములో అందఱికంటెను నేనే గొప్పవాఁడనని అనుకొని తబ్బిబ్బు అయితిని' అని ఆ ఉద్యోగమునుగూర్చి తరువాత ఒకసారి ఆతఁడు చెప్పినాఁడు.

ఇన్నాళ్ళుగ ఆతఁడు ఒకకన్యను ప్రేమించుచుండెను. ఆమె పేరు మేరీనిస్సెన్. డెన్మార్కునందలి టాండరన్ గ్రామ

ములో ఆతని ఇంటిముందుగా పోవు రోడ్డుప్రక్కను ఉన్న కుటీరము ఆమె కాఁపురపు కాణాచి. పదమూఁడేండ్ల బాల్యమునుండియు అతఁడు ఆమెను ప్రేమించినాఁడు. ఆ ప్రేమకు పేదతనము అడ్డురాలేదు. అతఁడు ఇల్లువిడచి ఇప్పటికి పండ్రెండు సంవత్సరములు ఐనది. ఇంతకాలమైనను వారిప్రేమ ఇగిరిపోలేదు.

ఇరువదియైదేండ్లు నిండగా ఆతఁడు తిరిగి డెన్మార్కునకు పోయినాఁడు. తనవలపును చూఱఁగొన్న మేరీని వివాహమైనాఁడు. ఈసారి యాత్రలో భార్యనుకూడ అతఁడు తనవెంట కొనిపోయినాఁడు.

స్వదేశసందర్శనము—వివాహమహోత్సవము—ఇంతకంటె శుభములు అనునవి ఎట్లుండును? ఇఁకమీఁద అతనికి కష్టములు అనునవి ఉండవా? ఒంటరి ప్రయాణమున సముద్రమున రెండుసారులు ఆతనికి ప్రబలములగు జలగండములు తప్పినవి. ఈసారి అతఁడు భార్యతోకూడ సముద్రయానము చేయుచున్నాఁడు. ఇప్పుడును అతనికి జలగండముందునా!

ఆ దంపతులు ఎక్కినఓడ చిత్రముగా సముద్రమున మునిఁగిపోయినది. చిన్నపడవను ఒకదానిని ఎక్కి ఆదంపతులు కష్టముమీఁద విడుదలకాంచినారు.

భార్యకు న్యూయార్కు పట్టణమున కాఁపురము కుదిర్చినాఁడు. న్యూయార్కు హార్బరునుండి అప్పుడే బయలుదేరిపోవుచున్న ఒక ఓడయొక్క కప్తాను క్రింది మొదటిపదవిని సంపాదించినాఁడు. కలిగిన జలగండములు అతనికి కలగుండు కలిగింపలేక పోయినవి.

ఉద్యోగము మంచిది. ఆరోగ్యము మంచిది. వయఃకాలము మంచిది. కోరఁదగినది ఇఁక ఏమికలదు!

సముద్రము—ఓడప్రయాణము అనిన అతనికి సరదా. భార్య అనిన నిండుప్రేమ. అతఁడు తిరిగి న్యూయార్కు వచ్చుసరికి అతనిభార్య వియోగక్లేశముతో చిక్కి శల్యమై ఉన్నది. తనమగనికి నావమీఁద ఉద్యోగ మగుట, అతఁడు సముద్రయానములు చేయుచుండుట ఆమెకు ఇష్టములేకపోయెను.

విడువక కలుగుచువచ్చిన జలగండములు కొంచెమేని మార్చలేని ఆతని హృదయమును ఇల్లాలి ప్రార్థనాసూక్తులు పూర్తిగ మార్చివైచినవి. సముద్రయానములకు స్వస్తి చెప్పుటకు అంగీకరించినాఁడు. అమెరికా సంయుక్తరాష్ట్రముల లోని పశ్చిమరాష్ట్రములకుపోయి ఏదైన వృత్తిని అవలంబించుటకు నిశ్చయించినాఁడు.

భార్యతోకూడ చికాగోవెళ్ళుటకు సరిపోవు సొమ్ముమాత్రమే అతనివద్ద ఉన్నది. కాగా అతఁడు చికాగోలో ఒక పశువుల శాలలో దినమునకు ఆఱుషిల్లింగుల జీతముగల పనికి కుదిరినాఁడు,

చాలకాలము కష్టపడి అతఁడు అఱువదిపౌనులు కూడఁబెట్టినాఁడు. ఆ డబ్బుతో ఒకపొలమును కొనినాఁడు.

డొంక, డొంక కొట్టివైచి మంచి సత్తువచేసి ఆ పొలమును ఆఱు సంవత్సరములలో సుక్షేత్రముగ చేసినాఁడు. అఱువది పౌనులకు కొనిన ఆ పొలమును ఆఱుసంవత్సరముల అనంతరము అతడు రెండువేల ఐదువందల పౌనులకు విక్రయించినాఁడు.

పిమ్మట అతఁడు ఇనుపసామానుల దుకాణమును ఒకదానిని కొని ఒక సంవత్సరము నడపి మూడువేల మూడువందల పౌనులకు అమ్మివేసినాఁడు.

ఇంకను పశ్చిమమున ఉన్న రాష్ట్రములకు పోవలయు నని అతనికి కుతూహలము కలిగినది. కాగా అతఁడు భార్యా సమేతుఁడై ఒరిగాన్ రాష్ట్రమునకు తరలి వెళ్ళినాఁడు. అచట అతఁడు ఒక పిండిమరను స్థాపించినాఁడు. స్థాపించుట తడవుగా అది జయపథమును అంటినది. కొద్దికాలములోననే అతఁడు ఏఁడాదికి పదుమూఁడు వేల పౌనుల లాభమును తీయఁగలుగు విశేషవ్యాపారము చేయుచుండెను.

అమెరికాఖండమునందలి పశ్చిమ రాష్ట్రములలోని మిక్కిలి పెద్దవగు పిండిమరలలో మారిట్జు పిండిమర ఒకటి. రోజుకు అది పదివేలపీపాల (బేరల్సు) పిండిని తయారుచేయును. అతనికి దానివలన డివిడెండ్లక్రింద పంద్రెండులక్షల పౌనుల సొమ్ము లబ్ధమైనది.

జలముమీఁద అతఁడు ఏపని చేసినను అపాయకర మగుచు వచ్చినది. భూమిమీఁద అతఁడు ఏపనిచేసినను అధిక ధనప్రాప్తికి కారణభూతమగుచు వచ్చినది. జలముమీఁద ఉన్నంతసేపును అతనిని వెన్నంటివచ్చిన దురదృష్టదేవత భూమి మీఁద అతని చెంతకైన వచ్చుటకును, తుదకు కన్నెత్తియైన అతనిని చూచుటకును జంకునది. భూమిమీఁద అతఁడు ముట్టినది బంగార మగుచుండెను.

అతఁడు జపానుదేశములో బ్రహ్మాండమగు పిండిమరను స్థాపించెను. కెనడాలో రంపపు మిల్లులు కట్టించెను. ఒరిగాన్‌లో ఇటుక ఆవములు నెలకొల్పి విశేషముగ ఇటుక వర్తకము చేసెను. వేల్సునుండి రాతిసిబొగ్గు దిగుమతిచేసెను. ఒక పెద్ద బిస్కత్తుల ఫ్యాక్టరీని కొని పనిసాగించెను. ౧౯౨౯-వ సంవత్సరమున ఆ ఫ్యాక్టరీ ఇరువదిమూఁడు లక్షల పౌనుల విలువగల

చిక్కుత్తులను విక్రయించినది. ఎంతటి అతిలోకమైన అభివృద్ధి!

మెక్సికోలో అతనికి ఐదువందల చతురపుమైళ్ళ భూమి ఉన్నది. పెక్కు వ్యాపారపు కంపెనీలయందు అతనికి వాటా లున్నవి. విశేషవ్యాపారము కావించుచున్న పదునాలుగు ఫరములకు అతఁడు ఇప్పుడు అధ్యక్షుమహాశయుఁడు.

ప్రేమపూర్వకముగు ఒక్కమాటకు కాని, చలిని ఆఁపు ఒక్క కోటుకుకాని నోఁచిపుట్టక ఇంటినుండి పరారీ అయిన పదుమూడేండ్ల బాలుఁడు మూఁడు జలగండములను దాఁటి బ్రతికి బట్టకట్టి పెద్దయై ఇప్పుడు చెప్పఁదగిన భూస్వామి, ఎన్నఁదగిన ధనస్వామి, గణింపఁదగిన వణిక్పుంగవుఁడు అయినాఁడు.

బి.సి. ఫార్బ్సు మహాశయుఁడు ఇటీవల మారిట్జును కలసికొని అతని జయమునకుఁగల రహస్యమును అడిగినాఁడు. అందుపై లోగడ నావికుఁడుగా ఉండిన మారిట్జు ఇట్లు బదులు చెప్పినాఁడు.

“నేను ఎట్టివిద్యనుకాని ఎఱుఁగకపోవుటయే నా జయమునకు బహుశః కారణమైఉండునని నానమ్మకము. నూనూఁగు మీసాల నూతనయౌవనమును ఒక కళాశాలయందు గడపియుందునేని నేను పూర్తిగా చెడిపోయిఉండుదును. అప్పుడు నాకు ఒళ్లువంచి పనిచేయుట కష్టమనిపించి అట్టిపనికి ఎల్ల వేళలయందును నేను దూరముగా ఉండుటకు ప్రయత్నించి ఉందును. కావున కాలేజీచదువు లేకపోవుటచేతనే నేను ఇంతవాఁడను ఐనానని చేయెత్తి చెప్పవచ్చును.”

కష్టములనడుమ చిక్కువడిన తమతమ వ్యాపారములను గట్టెక్కించుటకు విడువని దీక్షతో, వీడని ధైర్యముతో కష్టపడు వ్యాపారులకు సాయముచేయుట అనిన మారిట్జు చెవికోసి

కొనును. అట్టివారికి సాయముచేయుటకంటె అతనికి అధికమైన ఆనందమును కలిగించుపని మఱియొకటిలేదు. మంచి అవసరమునకు అతఁడు ఇచ్చిన అప్పులను పుచ్చుకొని, అతఁడు చేసిన హితబోధలను అనుసరించి బాగుపడి ధనవంతులయినవారు పదులకొలఁదిగ ఉన్నారు.

డెబ్బదియేండ్లు పైఁబడిన వృద్ధాప్యమునకూడ మారిట్జు, అతనిభార్య సుఖులై ఉండిరి. సీటిల్‌నందలి వారి బ్రహ్మాండ భవనమున వారి నివాసము. అతని అన్నదమ్ములు, అప్పచెల్లెండ్రు అచటికి చేరువనే నివసించుచుండిరి.

డెన్మార్కు దేశస్థులలో అత్యున్నతస్థితికి వచ్చినవారియందు మారిట్జు అగ్రశ్రేణికి చెందినవాఁడు. ఉన్నతస్థితికి తగిన ఉదారతయు అతనికడ ఉన్నది.

యువకుఁడుగా ఉండినప్పుడే కష్టపడి పనిచేయుట నేర్చుకొనినందులకు ఫలముగా ఈజయము నాకు కలిగినదని అతఁడు పలుతడవలు చెప్పుచుండును.



# బి. సి. మాక్లిలన్



బి. సి. మాక్లిలన్ కథ అనగా ఒకపెద్ద లాండ్రీ కథ.

లాండ్రీ—

మదరాసువచ్చివెళ్లు ప్రతి ఆంధ్రునకు లాండ్రీ అనిన ఏమియో తెలియును. ఆంధ్రదేశమున ప్రతి పెద్దపట్టణమునను ఇపుడు లాండ్రీలు వెలసియే ఉన్నవి.

రంగూన్ వెళ్ళివచ్చిన పాటకపు జనులు కొందఱు తెనుఁగు మాగాణిలోని ఒకమాదిరి పెద్దపల్లెటూళ్ళ అన్నిటి యందును ఇటీవల లాండ్రీలు నెలకొల్పినారు.

కావున లాండ్రీలును, లాండ్రీల పద్ధతియు తెలుఁగువారికి బాగుగ తెలిసినవే ఐఉన్నవని చెప్పవచ్చును.

అయినను ఇచ్చట చెప్పఁబోవు లాండ్రీచరిత్ర తెలుఁగు వారికి అద్భుతావహాముగ ఉండఁగలదు.

ఏమి అనగా, ఇచ్చట వర్ణింపఁబడునటువంటి లాండ్రీ ఆంధ్రదేశమున ఎచ్చటకాని లేదు. ఆంధ్రదేశముననే కాదు భారతదేశముననే లేదు.

అమెరికా సంయుక్తరాష్ట్రములకు చెందిన న్యూ ఆర్లీన్సులో ఒక లాండ్రీ ఉన్నది. దానిపేరు ఛార్లెటి లాండ్రీ. ప్రపంచములోని లాండ్రీలలో అది మొట్టమొదట పేర్కొనఁ దగినదని చెప్పవలసి ఉన్నది.

వారమునకు—ఆ లాండ్రీలో వారమునకు, పదునెనిమిది వేల బట్టలమూటలు చలువచేయఁబడును.

ఆ ఛార్లెటిలాండ్రీ అధ్యక్షుఁడు స్కాట్‌జాతీయుఁడు. అతనిపేరు బి. సి. మాక్లిలన్. అతని తలిదండ్రులు నిఱుపేదలు. బాల్యముననే అతఁడు తనపొట్ట తాను పోషించుకొనవలసిన వాఁడు అయ్యెను.

నిలుకడకల అతని మొదటి ఉద్యోగము ఒకానొక లాండ్రీలో. వారమునకు పదునాలుగు షిల్లింగుల జీతము.

స్వల్పమగు జీతము. అగుఁగాక! అతఁడు ఎట్టులో కష్టపడి అఱువదిపౌనులు కూడఁబెట్టినాఁడు. కూడఁబెట్టుట తడవుగా అతఁడు ఆసొమ్ముతో దివాలాతీయు స్థితిలోఉన్న ఒక

లాంఢ్రీని వెలకు తీసినాఁడు. రేయింబగళ్లు తదేకదీక్షగా అతఁడు పనిచేసి దానిని లాభకరమైన వ్యాపారసంస్థగా చేసినాఁడు.

వారమునకు నాలుగువేల బట్టలమూటలను ఉతుకు స్థితి వఱకును వ్యాపారమును పెంచినాఁడు. ఎంత తంటాలుపడినను వ్యాపారము ఆమీఁద పెరిఁగినదికాదు. ఆ వ్యాపారముయొక్క అభివృద్ధి పారముముట్టినట్లు కనిపించినది.

ఇట్లుండ ౧౮౯౦-వ సంవత్సరమున ఒకనాఁడు న్యూ ఆర్లీన్సునందలి ఒకానొక దినపత్రికయొక్క అడ్వర్టయిజు మెంటు మేనేజరు ఎ.జి. నేమియర్ అను అతఁడు మాక్లిలన్ ఆఫీసుకువచ్చి 'మీ లాంఢ్రీనిగూర్చి పత్రికలో ప్రకటనచేసి చూడుము. దానివలన ఏమైన క్రొత్తలాభము ఉండునేమో గమనింపుము.' అని చెప్పినాఁడు.

అట్లు చెప్పుటయేకాదు. తనపత్రికలో అరపుట స్థలము ఛార్లెటీలాంఢ్రీ ప్రకటనకు ఉచితముగా ఈయఁగలననియు ప్రోత్సహించినాఁడు.

'ప్రకటనకుఁగాను ఉచితస్థలము నాకు అవసరములేదు. ప్రకటన వేయుచో డబ్బుఇచ్చియే వేయుదును. ప్రకటనవిషయమై ఆలోచించి నెమ్మదిమీఁద చెప్పెదను' అని మాక్లిలన్ బదులు చెప్పినాఁడు.

మాక్లిలన్, నేమియర్ ఇరువురును దీర్ఘముగ ఆలోచించి ఛార్లెటిలాంఢ్రీ ప్రకటనప్రచారమునకు ఒకపద్ధతి నిర్ణయించినారు.

మొదటి సంవత్సరము పత్రికలయందు ప్రకటించుటకు మాక్లిలన్ వేయిపౌనులు వెచ్చపెట్టుటకు అంగీకరించినాఁడు.

ఆ ప్రకటన అతనికి ఎంతయో లాభమును కూర్చినది. ఎందరో కొత్త ఖాతాదారులను కొనివచ్చినది. ప్రకటనయొక్క ప్రయోజనము మాక్లిలన్‌కు తెలిసివచ్చినది. కాగా అతఁడు ప్రకటన విషయమై ఇంకను హెచ్చుసొమ్ము వ్యయముచేయ దొరకొన్నాఁడు.

న్యూ ఆర్లీన్సులో ఆ దినములందు బట్టలు ఉతుకుపని అంతయు నీగ్రోచాకెతల చేతులలో ఉండెను. బట్టలు ఉతుకు పద్ధతియు, ప్రదేశమును చాల అశుచిగా ఉండెను.

మాక్లిలన్ ఇది కనిపెట్టి తనప్రకటనలందు బట్టలు ఉతుకు పద్ధతియు, ప్రదేశమును శుచిగా ఉండవలసిన అవశ్యకతనుగూర్చి బోధింపసాగెను. ప్రతిగృహస్థుఁడును, ప్రతిగృహిణియు ఈ విషయమై తీవ్రముగ చర్చ సాగింపఁజొచ్చిరి.

పిమ్మట మాక్లిలన్ రసాయనిక శాస్త్రజ్ఞుని (కెమిస్టుని) ఒకనిని తనవద్ద పనికి కుదుర్చుకొనెను. బట్టలు ఉతుకు నీటిని, సబ్బును, బట్టలను ఇస్త్రీచేయు బొగ్గును, ఇతర రసాయనిక పదార్థములను (కెమికల్సును) పరీక్ష చేయుట ఆ కెమిస్టుపని.

లాండ్రీపనికి కావలసిన యంత్రములను— నూతనసౌకర్యములు సమస్తము సమకూడియున్న కొత్తవానిని—మాక్లిలన్ కొత్తగా కొనినాఁడు.

ప్రకటన అతనికి ఎంతమేలును కూర్చినదో ప్రజాసామాన్యమునకును అంతమేలును కూర్చినది. దినదినము క్రొత్త అభివృద్ధిపద్ధతులను అవలంబించునట్లు ఆ ప్రకటనలు అతనిని ప్రోత్సహించినవి. సర్వసమర్థమై తన లాండ్రీ వెలయుటకుఁగాను అతఁడు సకలప్రయత్నములు చేసినాఁడు.

ఇట్లుండ ఆ లాండ్రీని ఒక క్రొత్తసమస్య ఎదుర్కొనెను.

ప్రకటనవిషయమై లోగడ తనకు ఉపదేశముచేసిన నేమియర్ వద్దకుపోయి మాక్లిలన్ తనలాండ్రీని ఎదుర్కొనిన క్రొత్తసమస్యను ఇట్లు వివరించి చెప్పెను:

"వారములో మొదటి మూడురోజులును మాలాండ్రీలో ఊపిరిసలుపని పని ఉండుచున్నది. మిగిలిన మూడురోజులును బొత్తిగా పని ఉండుటలేదు. గురు, శుక్ర, శనివారములందును సోమ, మంగళ, బుధవారములందువలె లాండ్రీకి నిండుపని ఉండుట ఎట్లు?"

నేమియర్ ఆలోచించి ఒకపద్ధతిని సూచించినాడు:

"ఉతుకుటకుగాను సోమవారము తీసికొనిన బట్టలను ఉతికి బుధవారమునాడు కాతాదారులకు అప్పగించుము. అట్లే మంగళవారము తీసికొనిన బట్టలను గురువారమునాడును, బుధవారము తీసికొనినబట్టలను శుక్రవారమునాడును కాతాదారులకు అప్పగించుచుండుము. మఱియు వారమునకు చివర దినములలో ఉతుకుటకు వేయబడు బట్టలకు రుసుము కొంత తగ్గించుము."

నేమియర్ సూచించిన ఈ పద్ధతిని మాక్లిలన్ ఆచరణలో పెట్టినాడు. చక్కగ సాగినది. ఇతర లాండ్రీయజమానులు అందఱును ఈ పద్ధతి తప్పక అపజయమును అందునని జోస్యము చెప్పిరి.

కాని వారిజోస్యము నిజముకాలేదు. మాక్లిలన్ చేపట్టిన ప్రకటనపద్ధతి అతనికి జయమును కూర్చినది. నాలుగేనాలుగు ప్రకటనలు వేయుసరికి అతనిలాండ్రీలో సోమవారమునాడు ఎన్నిబట్టలు పడునవో శుక్రవారమునాడును అన్నిబట్టలు పడుటకు ప్రారంభమైనది.

బట్టలను కొనివచ్చి కొనిపోవు తనమోటారువానుల డ్రైవరులకు అతఁడు మంచి తరిఫియతును ఇచ్చి కాతాదారుల యెడ అణఁకువతోడను, మర్యాదగను వర్తించునట్లు చేసినాఁడు. వ్యాపారాభివృద్ధికి వలయు సమస్త విషయములును వారికి నేర్పినాఁడు.

అందుతో అద్భుతఫలితము కలిగినది.

ఇతర లాండ్రీయజమానులు మాక్లిలన్ ఛాత్సైటీలాండ్రీ పోటికి నిలఁబడలేకపోయిరి. వారు తొమ్మండుగురువచ్చి తమ వ్యాపారమును ఛాత్సైటీ లాండ్రీవ్యాపారముతో లీనముచేసి కొనమని మాక్లిలన్‌ను ప్రార్థించిరి.

తాను కాదనుచో ఆ లాండ్రీయజమానులు చేయఁగలది ఏమియులేదు. అయినను ఉదారాశయుఁడగు మాక్లిలన్ వారి ప్రార్థనమును కాదనలేదు. ఆ లాండ్రీలను అన్నిటిని తనలాండ్రీతో సమ్మేళనము ఒనరించినాఁడు.

అప్పుడు అతనిక్రింద మూఁడువేలమంది పనివాండ్రు. కాతాదారులనుండి మాసినబట్టలను కొనివచ్చి తిరిగి వారికి ఉతికిన బట్టలను అప్పగించుటకుఁగాను అతనికి రెండువందల నలుబది మోటారువానులు కలవు. అతని మూలధనము ౧౯౩౦ లో పదిలక్షల పౌనులు.

దరిమిలాను అతఁడు తనలాండ్రీతరఫున ఒక బ్యాండు మేళమును నియోగించినాఁడు. అది పౌరులకు ఉచితముగా ఆనందము కూర్చుచుండును.

ఏఁడాదికి నాలుగుసారులు 'హోమ్‌జర్నలు' అను పత్రికను అతఁడు వెలువరించుచుండును. ఒక్కొక్క సంచిక ఏఁబది వేల కాపీలు ముద్రితముగును. పాఠశాలలందలి విద్యార్థులకును,

విద్యార్థినులకును వానిని ఉచితముగా పంచియిచ్చును.

౧౯౭౯ లో అట్లాంటాలో అతఁడు మఱికొన్ని లాండ్రీలను ఏకముచేసి పదిలక్షలపౌనుల మూలధనముకల లాండ్రీ సంస్థను ఏర్పఱచినాఁడు.

ఇంతకును అతని ఇట్టి వ్యాపారవిజయమునకు ప్రారంభదినము ఏది? ఎ.జి. నేమియర్ అతనికి ప్రకటనను గూర్చి సలహా ఇచ్చిన దినమే.

మాక్లిలన్ విషయమున, ఇంకను పలువురు వర్తకుల విషయమున ప్రకటనయే పూర్తిఫలమును పొందుటకును, మంచి లాభమును పడయుటకును దారి చూపినది.



## ౧౦
## జాన్ యఫ్. స్టీవెన్సు



జాన్ యఫ్. స్టీవెన్సు నామమును మీరు ఇంతవఱకు ఎఱిఁగి ఉండకపోవచ్చును. అతఁడు కెనడా పసిఫిక్ రైలు రోడ్డును, గ్రేట్ నార్తరన్ రైలురోడ్డును, పనామా కాలువను నిర్మించిన మహనీయుఁడు.

కొండలను వంతెనలతో కలపియు, కొండలను ప్రదక్షిణించియు, కొండలను తొలచియు అతఁడు రెండు రైలురోడ్డులను నిర్మించినాఁడు. దక్షిణ అమెరికాను, ఉత్తర అమెరికాకును నడుమ పనామా కాలువను త్రవ్వి అట్లాంటిక్ మహా

సముద్రమును, పసిఫిక్ మహాసముద్రమును ఒండొంటితో కలపినాఁడు.

మూఁడును మూఁడు బ్రహ్మాండకార్యములు.

కొండల మీఁదుగా, కొండల చుట్టుగా, కొండల నడుమగా స్టీవెన్సు నిర్మించిన రైలు బాటలమీఁదుగా నేఁడు వేల కొలఁది రైళ్ళు నిరంతరము పరుగులెత్తుచున్నవి.

ఉత్తర దక్షిణ అమెరికాల నడుముగా అట్లాంటిక్ పసిఫిక్ మహాసముద్రములను కలుపుచు అతఁడు త్రవ్వించిన పనామా కాలువగుండా నేఁడు వేలకొలఁది ఓడలు నిరంతరము ప్రయాణించుచున్నవి.

౧౯౩౦-వ సంవత్సరమునాఁటికి అతనికి డెబ్బదియైదు సంవత్సరములు. నిండు నలుబదిసంవత్సరములు అతఁడు సాహసము, మోసము పనుల సందర్భమున ప్రాణాంతకములగు ప్రమాదములకు గుఱియగుచుండువాఁడు. ఒక్కొక్కప్పుడు అట్టి ప్రమాదములు అతనికి ప్రతిదినమును కలుగుచుండునవి. వానిని ఎల్లను అతిక్రమించి అతఁడు డెబ్బదియైదు సంవత్సరములకు పైఁబడి బ్రతికినాఁడు.

బ్రతికినంత కాలమును అతఁడు బద్ధకము ఎఱుఁగక పని చేయుచుండువాఁడు.

అతఁడు తన జీవితకాలమంతయు అసంభవకార్యములను సంభవకార్యములుగా చేయుటయందే కడపెను. అతనిపని ఏనాఁటికి ఆనాఁడే క్రొత్తది. ఇతర మానవమాత్రులు చేయఁగల ఏపనిని కాని అతఁడు చేయలేదు. అనగా అతఁడు చేసిన పనులు ఇతర మానవులు ఎవ్వరును చేయఁజాలనివి అనుట.

ప్రపంచమునందలి ఇంజనీర్లకును, రైల్వే మెన్ కును

అతని పవిత్రనామము చిరపరిచితమనుట కాదనరానివిషయము.

ప్రథమ ప్రపంచ మహాసంగ్రామావసరమున మిక్కిలి కష్టపుపని ఒకటి అతనికి ఈయఁబడెను. సైబీరియన్ రైల్వే యాజమాన్యమే ఆ కష్టపుపని. ౧౯౨౦-వ సంవత్సరము వఱకును ఆ రైల్వేమీఁద రైళ్లు సాగుచుండుటకు తగు బందోబస్తును అతఁడు చేయఁగలిగినాఁడు. కాని బోల్షివిజము వెల్లువవలె వచ్చి సైబీరియాను ముంచెత్తినపుడు స్టీవెన్సు సైబీరియన్ రైల్వేయాజమాన్యమును వదలివైచినాఁడు.

ఈ ప్రపంచమున స్టీవెన్సు అంతవానికి కూడ నమలరాని నారికేళములై ఉండునవి కొన్నికలవని అప్పుడు అనుకొనవలసి వచ్చినది.

భావి అభివృద్ధిని సూచింపఁగల అనుకూల్యములు ఏవియు బాల్యమున జాన్ యఫ్. స్టీవెన్సువద్ద లేకుండెను. అతని తండ్రి ఒకచిన్న పట్టణముచెంత నివసించుచుండిన పేద రైతు.

స్టీవెన్సు చిన్నతనమున సామాన్యముగ చిన్నపాఠశాలకు పోయి ఏవియో రెండుముక్కలు నేర్చుకొనెను. అంతియేకాని అతఁడు ఎన్నడును కళాశాలలో కాలు పెట్టి ఎఱుఁగఁడు.

పెరిఁగి పెద్దవాఁడు ఐనపిమ్మట వృత్తివిద్యలకు సంబంధించిన పుస్తకములు, పత్రికలు చదివి విద్యాభివృద్ధి కావించుకొనినాఁడు.

పగలు అంతయు పనిచేయువాఁడు—సగమురాత్రి వఱకును చదువువాఁడు. ఇట్లని అతనిమిత్రులు చెప్పుదురు.

అతని జీవితములో ప్రథమ సదవకాశము అతనికి ౧౮౭౨ లో సంఘటించెను. మానిటోబా గుండాను, కొండల

మీఁదుగను కెనేడియన్ పసిఫిక్ రైలుబాటను నిర్మించు పనికి అతఁడు కుదురుకొనెను.

కెనేడియన్ పసిఫిక్ రైల్వే ఒకానొక పందెముపై నిర్మితమై ఉండుట పెద్దల జ్ఞప్తినుండి ఇంకను తొలఁగిఉండదు.

రైల్వేకంపెనీవారికి కెనేడియన్ గవర్నమెంటువారు ఇట్లు చెప్పిరి:

'పదియేండ్లలోపుగ మీరు ఈ రైలుబాటను నిర్మించుచో మేము మీకు ఏఁబదిలక్షల పౌనుల ధనమును, రెండు కోట్ల యకరముల భూమియు ఇచ్చెదము. కాని పదిసంవత్సరములలోగా మీరు ఈ రైలుబాటను నిర్మింపఁజాలరా మీకు ఏమియు ఈయఁజాలము.'

అంతట పై రైల్వేకంపెనీవారు జాన్ యఫ్. స్టీవెన్సుకు కబురుపంపి రప్పించి 'కెనేడియన్ పసిఫిక్ రైల్వే నిర్మాణము అంతయు నీచేతులలో పెట్టుచున్నాము. నిముసములమీఁద పనిని కావింపుము.' అని చెప్పినారు.

చెప్పుటయే తడవుగా స్టీవెన్సు అంగీకరించినాఁడు. అంగీకరించుటయే తడవుగా పనికి ప్రారంభించినాఁడు. ఆఱు నెలలలో విస్కాన్సిన్‌కు పశ్చిమమున వేయి మైళ్ళవఱకు రైలుబాట నిర్మించినాఁడు.

మూఁడు వేల అడుగుల ఎత్తునఉన్న కనుమలను వంతెనల మూలముగ కలిపినాఁడు. కొన్ని పర్వతములను తొలుచుకొనిపోయినాఁడు. కొన్ని పర్వతములను చుట్టిపోయినాఁడు. పోవలసిన ప్రదేశమును అంతయు అతిక్రమించినాఁడు. తాను వేయవలసిన రైలుబద్దెలను తెచ్చి వాంకోవరునందు పసిఫిక్ మహాసముద్ర తీరమున స్థాపించినాఁడు.

ఐదు ఏండ్లలో రైలుబాట నిర్మాణము ముగిసినది. గడువు ఇంకను ఐదుసంవత్సరములు కలదు. సగకాలములోనే అతఁడు పనిని పూర్తిచేసినాఁడన్నమాట.

అప్పుడు జేమ్సు జె. హిల్—లోకప్రఖ్యాతిగల కెనడా నాయకుఁడు—స్టీవెన్సుకు వర్తమానముచేసి గ్రేట్ నార్తరన్ రైలుబాట నిర్మాణభారమును అతనిపై పెట్టెను.

కెనడా పసిఫిక్ రైలుబాటవలె గ్రేట్ నార్తరన్ రైలుబాటకూడ కొండప్రదేశములగుండా పోవలసినదే.

అయినను స్టీవెన్సు వింధ్యపర్వతమువంటి పర్వతములను కూడ వంగదీయఁగల అగస్త్యుఁడు; రెక్కలుగల కొండలను కూడ పిండికొట్టఁగల వజ్రాయుధుఁడు. అగుటను అతఁడు గ్రేట్ నార్తరన్ రైలుబాట నిర్మాణమునుకూడ స్వల్పకాలములోనే ముగించెను.

అనంతరము అతనిపై పనామాకాలువ త్రవ్వభారము మోపఁబడెను. ఆ పనినికూడ అతఁడు అచిరకాలముననే ముగించెను.

క్రొత్త ప్రపంచమున ప్రయాణము సుకరమైనదిగాను, సువేగమైనదిగాను, సురక్షితమైనదిగాను చేసినవారిలో స్టీవెన్సు మేటి.

మహాసముద్రముల మధ్యనున్న అడ్డులను అతఁడు అలవోకగా తొలఁగించివైచినాఁడు.

స్టీవెన్సుతో కలసి పనిచేసినవారందఱును అతనిని గాఢముగ ప్రేమింతురు. అతఁడు నిగర్వచూడామణి, సాధుస్వభావుఁడు, పెద్దమనిషి.

అతనిది గొప్పజీవితము. పూర్వపీఁడల జీవితముతో సరి

పోల్పఁడగినది. అతని ప్రయోజకత్వముచే నిర్మితములైన రైలు బాటలు, పనామా కాలువ అతని నామమును ఇచట శాశ్వతముగ నిలుపఁగలవు.

ఉత్తర అమెరికాయందలి పర్వతశిఖరములలో అత్యున్నతమైన ఒకదానిపై బ్రహ్మాండాకృతికల అతని కంచు విగ్రహము ఒకటి స్థాపితము ఉన్నది.

అతని భౌతికదేహము కొండలను పిండిచేసినది. అతని కాంస్యదేహము కొండలనెత్తికి ఎక్కినది.



# ౧౧

# హెన్రీ డబ్ల్యు. ఎ. డిటర్డింగ్



క్రీస్తుశకము ౧౯౩౭-వ సంవత్సరము మే ౨౩-వ తేదిని చనిపోయిన జాన్ డేవిసన్ రాక్‌ఫెల్లర్ అమెరికా ఖండపు నూనె రాజు. మన ప్రస్తుతకథకు నాయకుఁడైన సర్ హెన్రి డబ్ల్యు. ఎ. డిటర్డింగ్ ఆసియా, ఐరోపా ఖండముల నూనె రాజు అనఁదగినవాఁడు.

డిటర్డింగ్ ఆసియా, ఐరోపా ఖండముల రాక్‌ఫెల్లర్.

సర్ హెన్రీ డబ్ల్యు. ఎ. డిటర్డింగ్ డచ్చిజాతికి చెందినవాఁడు. ఇతర డచ్చిజాతీయులవలె అతఁడును తెలివైనవాఁడు, ఒడలు దాఁచుకొనక పనిచేయువాఁడు.

రాయల్ డచ్ షెల్ మెక్స్ ఆయిల్ కాంబినేషన్‌కు సర్ హెన్రీ డబ్ల్యు. ఎ. డిటర్డింగ్ అధ్యక్షమహాశయుఁడు.

సర్ హెన్రీ ఆంగ్లదేశమున స్థిరపడినాడు. చరమదశలో అతడు నూట ఇరువదియైదు నూనెకంపెనీలకు యజమానియై ఉండినాడు.

ప్రపంచమునందలి నాటి మొదటిపండ్రెండుగురు వర్తకశిఖామణులలో సర్ హెన్రీ ఒకడు.

అగుంగాక! జీవితము ప్రారంభించుసరికి అతనివద్ద ఎట్టి డబ్బుకాని లేదు, అతనికి ఎట్టి స్నేహితులుకాని లేరు, ఇతర సౌకర్యములు ఎట్టివికాని అతనికి లేకుండెను.

ఆ దినములలో సర్ హెన్రీకి ఉన్న ఆస్తి అంతయు కార్యశౌర్యము, పట్టుదల మున్నగు సుగుణములు మాత్రమే.

హెన్రీ పుట్టుక ఎక్కడ? ఆమ్‌స్టర్‌డమ్ నగరమందలి ఒకానొక కుటీరములవీధిలో.

అతని తండ్రికి ఏమిఉద్యోగము? విశేషముగు జీతములేని కష్టాను ఉద్యోగము.

ఇంతకును—హెన్రీ మొదటిఉద్యోగము ఏమి? ఒక బ్యాంకులో ఉత్తరములు, వర్తమానములు కొనిపోవుచు, కొనివచ్చుచు ఉండుపని.

ఐతే—జీవితమున అతనికి ప్రథమావకాశము ఎట్లు కలిగినది? అభివృద్ధిని అందవలయునను తీవ్రకాంక్షలో—అప్పటికి చేయుచున్న పనిని కాలితో తన్నిపోవుటచేత.

ఇరువదిరెండేండ్లు నిండువఱకును హెన్రీ బ్యాంకులోని ఉద్యోగమునే అంటిపెట్టుకుని ఉండినాడు. అప్పటికి అతనికి తెలిసివచ్చినది: తనపరిశ్రమకు, ప్రతిభకు ఆ బ్యాంకు కార్యాలయము చాల సంకుచితమైనదని. తాను స్వయముగ విశేష వ్యాపారమును సాగింపగలనని హెన్రీకి తోచినది.

తోఁచుట తడవుగా అతఁడు బ్యాంకు ఉద్యోగమునకు రాజీనామా ఇచ్చినాఁడు. నెథర్లాండ్సు ట్రేడింగు సొసైటీలో క్రొత్త ఉద్యోగము సంపాదించినాఁడు. నెథర్లాండ్సు ట్రేడింగ్ సొసైటీ పూర్వపు ఈస్టిండియా కంపెనీవంటిది.

సొసైటీవారు ఉద్యోగధర్మములో అతనిని దక్షిణ వలస రాజ్యములకు పంపిరి. అతఁడు అప్పుడు జూనియరుక్లర్కు మాత్రమే. అయినను వస్తువిక్రయమున అతిలోకప్రజ్ఞ చూపుటకు ప్రారంభము చేసినాఁడు.

చేయవలసినదిగ అధికారులు నియమించు పనికంటె ఎక్కువపనిని అతఁడు చేయువాఁడు. అతఁడు ఏపని చేసినను తాను కంపెనీయొక్క జీతగాఁడను అను దృష్టితో కాక కంపెనీ యొక్క భాగస్వామిని అనుదృష్టితోఁ చేయుచుండువాఁడు.

అందుతో ఆ కంపెనీ యజమానులు అతనిని ఆ కంపెనీ తరఫున వస్తువిక్రేత (సేల్సుమెన్)గా నియమించిరి. హెన్రీ జీవితమున అప్పటినుండి ఉత్తమఘట్టము ప్రారంభమైనది. అప్పటినుండి అతఁడు నూనె అమ్ముటలో ప్రత్యేకశ్రద్ధ వహించెను.

ఒకటి రెండు సంవత్సరములలో అతనికి రాయల్ డచ్ ఆయిల్ కంపెనీయొక్క సేల్సుమేనేజరు పదవి లభించెను. అచిరకాలముననే హెన్రీ ప్రపంచమునందలి సమర్థులగు సేల్సు మేనేజరులలో ఒకఁడని అనిపించుకొనెను.

తనకు అదివఱకే ఏర్పడి ఉన్న ఖాతాదారులతో వ్యవహరించు విషయమునందే ఇతర వ్యాపారులవలె అతఁడు దినమునకు ఏడేసిగంటల కాలమును వెచ్చింపలేదు. హెన్రీ దినమునకు ఎన్నిగంటల కాలమును వెచ్చించినను వ్యాపారమున

తన ప్రత్యర్థులగువారికి ఉండిన ఖాతాదారులను తాను ఆకర్షించుటకు మాత్రము వెచ్చించువాఁడు.

క్రొత్త ఖాతాదారులను ఆకర్షించుటకై అతఁడు న్యాయబద్ధమైన ప్రతిపనిని చేయువాఁడు. వస్తువు మూల్యమును తగ్గించువాఁడు. ఒకానొక వ్యాపారిని తాను క్రొత్త ఖాతాదారుగ ఏర్పఱచుకొనఁగలనని అతనికి నమ్మకము తోఁచుచో ఒక పెద్దపీపాయి ( బేరల్ ) నూనెనుకూడ ఆ వ్యాపారికి మిక్కిలి చౌకధరకు విక్రయించువాఁడు.

నూనె వ్యాపారమున అతని ప్రత్యర్థి కౌడ్రేప్రభువు. తలఁచినచో కౌడ్రే స్వయముగ నూనెరాజై రాక్ ఫెల్లర్ అంతటివాఁడై ఉండును. అట్టివానికి మన హెన్రీ నూటఏఁబది లక్షల పౌనుల ధనమును ఒక్కసారిగ ఇచ్చి ఆవర్తకమున అతనికి ఎట్టి జోక్యములేకుండ అనగించి నాఁడు.

బియర్ స్టెడ్ ప్రభువుతో సంప్రదించి షెల్ కంపెనీని కుండ బ్రహ్మాండముగు తన ఆయిల్ కంపెనీలోనికి కొనివచ్చినాఁడు. ౧౯౩౦ ప్రాంతమున జర్మనీయందలి నూనె కంపెనులను కుండ లోఁగొనుటకు అతఁడు ప్రయత్నములు సాగించినాఁడు.

నూనెను సిద్ధము చేయు ఐసు రిఫయినరీలకు—వలస రాజ్యములయందు రెండులక్షల నలుబది యొకవేయి యకరముల నేలలో వ్యాపించి ఉన్న నూనె గనులకు అతఁడు ఇప్పుడు కామందు.

౧౯౩౦-వ సంవత్సరమునకు అతనికి అఱువదిరెండు వత్సరములు. ఉష్ణప్రదేశమగు ప్రాగ్దేశమున చిరకాల ముండివచ్చినవాఁడు కావుట హెన్రీ తల అప్పుడే నెరిసినది; నేత్రములు నల్లబారినవి; చర్మము కాంతివాసినది.

హెన్రీకి ప్రయోగము, ఉపసంహారము రెండును తెలియును. వలయుచో ముందుకు దూసుకొని పోగలడు. అవసరమగుచో చల్లగ వెనుకకు మఱలగలడు.

అతడు పామేదాతనము కలవాడే. అయినను ప్రజ్ఞానిధి. వస్తువిక్రేతగా హెన్రీ అద్వితీయుడు. వ్యాపార విస్తృతియే హెన్రీ ప్రధానలక్ష్యము.

అతని ఆఫీసు లండన్‌లో. అది అతనికి ఎక్కవుంటుకల బ్యాంక్‌కు ఎంతయో దూరమున లేదు. అతనిచుట్టును వలయాకారమున మేజాబల్ల తీరిచి ఉండును. మందిరముయొక్క ఐదవ అంతస్థున హెన్రీ ఆఫీసు గది.

ఆగదిలో ఆ వాణిజ్యపూజ్యుని ఎదుట ప్రపంచ పటము ఒకటి వ్రేలాడుచుండును. పారశీక దేశమున తప్ప ప్రపంచమున నూనెకల అన్ని దేశములందును అతని కంపెనీవారికి ఆస్తికలదు.

ఇది అతని కడకాలపు స్థితి.

అఱువది ఏండ్లక్రితము అతడే ఆమ్‌స్టర్‌డమ్ నందలి ఒకానొక మారుమూలవీధిలో ఒకానొక చిన్న కుటీరమున పేదబాలుడై నివసించుచు గాలికి తఱుచు ఆరిపోవు కొవ్వువత్తి దీపముముందు ప్రపంచయాత్రకు సంబంధించిన పుస్తకములను చదువుకొనుచుండువాడు. ఎంతటి భేదము!

ఎక్కవుంటు గుమాస్తాగా ఉండి తన తీరికసమయమును వ్యర్థపఱుపక నూనె పరిశ్రమను గూర్చిన వాఙ్మయము నంతను సంపాదించి చదివి అవకాశము అందుకొని పైకివచ్చిన రాక్‌ఫెల్లర్ జీవితముతో డిటర్డింగ్ జీవితము సర్వవిధముల జతపడుచున్నది.

## ౧౨

# ఫ్రాంక్ మెక్‌విల్లి

చిల్లరగా చెప్పులు అమ్ము వ్యాపారములో లాభములు మిక్కిలి తక్కువగా ఉండును. కాని చిల్లరగా చెప్పులు అమ్మి లక్షలకొలఁది ధనము ఆర్జించిన వ్యక్తి ఒకఁడు కలఁడు.

అతని పేరు ఫ్రాంక్ మెక్‌విల్లి.

అతనికి అమెరికా సంయుక్త రాష్ట్రములందు రెండు వందల జోళ్ళ దుకాణము లున్నవి.

ఫ్రాంక్ మెక్‌విల్లి అసామాన్యవ్యక్తి. అతఁడు స్కాట్ జాతీయుఁడు. అతనిది గట్టిశరీరము. పొడుగైనవాఁడు. ౧౯౩౦-వ సంవత్సరమునాఁటికి అతనికి డెబ్బదియొక్క సంవత్సరములు నిండినను ఆరోగ్యవద్దేహుఁడై ఉండెను.

అతఁడు పుట్టినది దరిద్రకుటుంబమున. ఎవరుకాని అతనికి ఎట్టి ధనమునుకాని ఈయలేదు. జీవితములోని మూఁడు భాగములలో మొదట భాగమున అతడు మిక్కిలి దురదృష్ట వంతుఁడై ఉండెను.

పదునైదేండ్ల కాలప్రాయమున అతఁడు ఒకానొక లాయరు ఆఫీసులో వారమునకు పండ్రెండు షిల్లింగుల జీతమునకు గుమాస్తాగా కుదిరెను.

ఆ జీతము అతనికి చాలలేదు. అతనికి ఇంకను ఎక్కువ డబ్బు కావలసి ఉండెను. కావున టోపీలుచేయు ఒక దుకాణములో అతఁడు పనికి కుదిరెను.

వారమునకు ఇంత జీతము అనుపద్ధతికి అతఁడు అంగీక రింపలేదు. ఇంతపనికి ఇంతడబ్బు అను పద్ధతికి ఒప్పందము. మెక్‌విల్లి మిక్కిలి కష్టపడి పనిచేసెను. విశ్రాంతి ఎఱుఁగని పరిశ్రమ. వారమునకు ఎనిమిది పౌనులను సంపాదింపఁగలిగెను.

కొంత ధనమును కూడఁబెట్టినతోడనే స్వతంత్ర వ్యాపా రమునకు ప్రారంభము చేసెను. మొదట గ్రుడ్ల వ్యాపారము. పిమ్మట పడమటిదేశమునకు పోయి పసులకాపరి అయ్యెను.

పశువులు చర్మమును, చర్మము జోళ్ళను అతని ఆలో చనకు తెచ్చినవి కాఁబోలును! అప్పటి ఆతని ఆలోచన ఎల్ల వేళలయందును జోళ్ళే.

ఒకానొక జోళ్ళకంపెనీలో ఎక్కువుంటు గుమాస్తాపని ఆతనికి లభ్యమాయెను. ఆ సందర్భమున మెక్‌విల్లి జోళ్ళు చేయుటకు అగు ఖర్చు, వాని అమ్మకమువలన వచ్చు లాభము బాగుగ ఆకళించెను.

అటుపిమ్మట అతఁడు జోళ్ళకంపెనీకి ఏజెంటై ఊరూర తిరిగి చిల్లర వర్తకులకు జోళ్ళను విక్రయించువాఁడు.

ఇట్లు పనిచేయుచు అతఁడు జోళ్ళ వ్యాపారమునఁగల సుళువు, బరువులను అన్నిటిని నేర్చుకొనువాఁడు. నిచ్చెన మెట్లను ఒక్కొక్కదానిని ఎక్కునట్లు ఆతఁడు జోళ్ళవ్యాపార మున ఒక్కొక్క మెట్టును ఎక్కుచు ఆ వ్యాపారవిషయమై సమస్తమును నేర్చుకొనెను.

ఇఁక ఇప్పుడు అతనికి కావలసినది ఏమి? తనదైన ఒక జోళ్ళషాపు. అతనికి అప్పటికి ముప్పదినాలుగు ఏండ్లు. అప్పుడు ఆతఁడు తన యజమానివద్ద రెండువేల పౌనులను అప్పుచేసెను. చెప్పుల దుకాణమును స్థాపించెను. అనంతరకాలమున అతని

యూాజమాన్యమున బయలు దేరిన రెండువందల నలుబదితొమ్మిది చెప్పుల దుకాణములకు ఇదె పూర్వకథ.

మొదటి దుకాణమును స్థాపించునప్పటికి అతని ముఖ్యాభిప్రాయము ఏమి? అందముగా, అమరికగా, బాగుగా దుకాణమును ఏర్పాటుచేయుట.

దుకాణమునకు ముందరిభాగమున పెద్ద పెద్ద అద్దములతో దర్వాజాలు పెట్టించెను. ఆ దర్వాజాలు ఏమూలగా ఏర్పాటు చేయబడుటచే దుకాణములోనికి ఏదిక్కునుండి వచ్చినను వచ్చువారికి జోళ్ళు స్పష్టముగా కనిపించుటకు అవకాశము ఏర్పడెను.

ఆ దుకాణము జయపథమును పట్టెను. అచిరకాలమున నే అతడు మఱినాలుగు క్రొత్తషాపులను స్థాపించెను. ఇప్పుడు అతనివి రెండువందల ఏబది జోళ్ళషాపులు. వాని అన్నిటియందును మగవాళ్ళజోళ్ళు విక్రయింపబడుచుండెను.

అతని షాపులు మూడు రకములవి. మొదటిరకము షాపులలో మిక్కిలి విలువకల జోళ్ళు అమ్మబడును. రెండవ రకము షాపులలో మధ్యరకపు జోళ్ళు అమ్మబడును. మూడవ రకము షాపులలో పదునాఱు షిల్లింగుల వెలగల జోళ్ళ జతలు అమ్మబడును.

౧౯౨౮ లో అతని దుకాణముల అన్నిటియందును కలసి నలుబది లక్షల పౌనుల విలువకల జోళ్ళు విక్రయింపబడెను.

జోళ్ళను మరమ్మతుచేయు అతని షాపు ప్రపంచములో జోళ్ళను మరమ్మతుచేయు అన్నిషాపులకంటెను పెద్దది. దానిని షాపు అనుటకంటె ఫ్యాక్టరీ అనుట ఉచితము. మరమ్మతు విషయమున కొద్దిలాభమును తీసికొనుటయే అతని సంకల్పము.

అతఁడు తన మేనేజర్లకు స్వయముగా తరిఫీయతును ఒసఁగును. అవసరమగుచో వారితోకూడ కలసి పనిచేయును. ఒక్కొక్కప్పుడు అతఁడు తనపనివాళ్ళతో కలసి పనిచేయును. ఒకప్పుడు జోళ్ళను కొట్టుటలో తాను చూపిన చాకచక్యమును అట్టి సమయములందు ఆతఁడు వారికి నేర్పఁగలుగును.

జోళ్ళు పెట్టియందు పెట్టును ఆతఁడు తెలుచునంత చులుకుగా ఆతని పనివారలలో మఱి ఎవ్వరును తెలుపఁజాలరు.

ప్రతి శనివారమును ఆతఁడు తనపనివారల అందఱితో సంప్రదించుచుండును. వారికి ఉచితముగు సలహాలను ఇచ్చుటలో ఆతనికి కుతూహలము మెండు. తనపనివారల అందఱకును తాము ఒక కంపెనీకి చెందినవారము అను ఐక్యభావము కలుగుటకై ఆతఁడు విశేషకృషి చేయును. తన మేనేజర్లకు అతఁడు తఱుచు విందులు చేయుచుండును.

అతఁడు నికరమైన సరుకునే విక్రయించును. పనికిమాలిన సరకును విక్రయించుటకు అతఁడు ఎంతమాత్రమును అంగీకరింపఁడు. ప్రతియొక ఖాతాదారును తిరిగి రావలయునని అతఁడు కోరును.

'నమ్మకమే వ్యాపారమునకు మూల స్తంభము. దుకాణదారుని సుగుణము వ్యాపారవిజయమునకు మూలసూత్రము.' అని అతఁడు చెప్పును.

అతఁడు ప్రపంచమునందలి జోళ్ళ చిల్లరవర్తకులలో అద్వితీయుఁడు.

అతఁడు చెప్పులవ్యాపారములో చెప్పరానిధనము ఆర్జించినాఁడు. అందు ప్రతి దమ్మిడీయు న్యాయముగ ఆర్జించినది.



## ౧౩
# టైమొథీ ఈటన్

బ్రిటీష్ కామన్‌వెల్తుకు లండన్ ముఖ్యపట్టణము. ఐనను ఆ సామ్రాజ్యమునగల కిరాణాదుకాణములలో మిక్కిలి పెద్దదిమాత్రము ఆ మహానగరమున లేదు.

బ్రిటీష్ కామన్‌వెల్తున కల కిరాణా దుకాణములలో బృహత్తరమైనది కెనడాయందు కలదు. దాని నిర్మాత టైమొథీ ఈటన్. అతని ప్రధాన కార్యస్థానములు టొరెన్‌టో, విన్నిపెగ్ నగరములందు.

టైమొథీ ఈటన్ దుకాణములో ఇరువది వేలమంది జీత గాళ్ళు ఉన్నారు. టొరెన్‌టోలోని దాని కార్యస్థాన మందిరములు అఱువదిరెండు యకరముల ఆవరణలో నిర్మితములు ఐనవి.

అందు పనిచేయు ప్రతి డైరెక్టరును, ప్రతి మేనేజరును అభిమానపూర్వకముగ నియమితులు ఐనవారు కారు. ఆ దుకాణమున సామాన్యముగ పనివాళ్ళుగ ప్రవేశించి తమ తెలివి తేటల చేతను, పరిశ్రమచేతను క్రమముగ పైకివచ్చినవారు.

శుభారంభుఁడు ఈటన్ పుట్టినది అల్‌స్టరులో; పెరిఁగినది అల్‌స్టరులో. కాని అతఁడు అల్‌స్టరు వీడి టొరెన్‌టో వెళ్ళి ౧౮౬౯-వ సంవత్సరమున అచట దుకాణము పెట్టెను.

మహానదుల పుట్టుకవలె ఆ పెద్ద దుకాణము పుట్టుకయు అల్పాదల్పమై ఉండెను. కాని భావిఅభివృద్ధిని సూచించెడు లక్ష

ణములు ఆ దుకాణముపట్ల జన్మఘుడియయందే పొడకట్టెను.

దుకాణము విషయమున అతఁడు నాలుగు నియమము లను పెట్టుకొనెను. ఆ నియమములను అతఁడు నూటికి ఆచర ణాలో పెట్టెను.

ఆ నియమములు ఏవి యన :

౧. వస్తువులు తృప్తికరములు కానిచో డబ్బు వాపసు.

౨. ఒకటే ధర. అమ్మకము రొక్కమునకే. అరువు బేరము లేదు.

౩. కొనవలసినదిగ ఎవరిని బ్రతిమాలకూడదు.

౪. ఏ వస్తువునుగూర్చి కాని సరియైన స్థితి వెల్లడింపవలయునే కాని ఎట్లయిన అమ్మివేయవలయునను దృష్టితో లేని గుణములను ఆరోపించి చెప్పకూడదు.

ఈ నియమములు నేఁడు అన్ని పెద్దదుకాణములందును అవలంబింపఁబడునవే. కాని ౧౮౬౯ నాఁటికి అవి అపూర్వ ములై ఉండెను. అపూర్వములై ఉండుటే కాదు అవి ఆనాఁడు ఇతర వర్తకుల అపహాసమునకుకూడ పాత్రములు అయ్యెను.

ఇతర వర్తకులు ఈటన్‌ను స్వప్నలోకవిహారి అని అధి క్షేపించిరి. నిజమునకు అతఁడు స్వప్నలోకవిహారియే. విశే షము ఏమన అతఁడు స్వప్నములనే నిజవృత్తాంతములుగ మార్చినాఁడు.

అతఁడు ప్రజ్ఞాశాలి. జీవితకాలమున ప్రతివారమును అతఁడు ఏదియో ఒక నూతనవిషయమును కనుఁగొని ఆచర ణాలో పెట్టుచుండువాఁడు.

ఖాతాదారులను మోసముచేయుట అనుదానిని అతఁడు పూర్తిగ కంటగించుకొనును. అతని అసిస్టెంటు ఒకసారి ఒక

కాతాదారునితో ఒక బట్టనుగూర్చి తెలుపుచు అది అంతయూ ఉన్నితో నేయఁబడినది అని అనెను. ఆ మాటకు ఈటన్ అడ్డువెళ్ళి 'కాదు, ఇది అంతయు ఉన్నితో నేయఁబడినది కాదు, సగము పత్తినూలు, సగము ఉన్ని.' అని చెప్పినాఁడు

తన దుకాణమున అసత్యము అనునది కాలుపెట్టరాదని అతని సుగ్రీవాజ్ఞ. వ్యాపారాభివృద్ధికి అసత్యము వచించుట సహకారి అను నీతిలో అతనికి నమ్మకము లేదు.

ఏ వస్తువునుగూర్చి కాని ప్రకటన వ్రాయవలసి వచ్చుచో ఆ ప్రకటన వ్రాయువాఁడు స్వయముగ ఆ వస్తువును చూచి దానివిషయమున పూర్తి తృప్తిని పొందవలయును.

వస్తువుయొక్క పరిమాణము, గుణము, రంగు, ధర, నేతమున్నగువానిని గూర్చి చెప్పవలసి వచ్చుచో వానిని నికారసుగ చెప్పవలయును. అందు ఎంతమాత్రమును వాతప్పు రాకూడదు.

ఆ దుకాణమున ఒక పరిశోధకశాఖ ఉన్నది. వస్తుపరీక్ష కావించుట ఆ శాఖయొక్క ప్రత్యేకపు పని.

పరిశోధకశాఖవారే కాక ఈటన్ కూడ అప్పుడప్పుడు దుకాణమును పరిశోధించుచుండువాఁడు. అట్టి సమయములయందు ఏ వస్తువులమీఁదను ఐన తప్పుచీటి అంటింపఁబడి ఉన్నచో దానిని పీకివైచి నిజస్థితిని తెలుపు చీటిని అంటించుచుండువాఁడు. ఏ వస్తువు కాని దాని నిజస్థితియందే ప్రదర్శితము కావలయును.

'అందఱను న్యాయముగ తృప్తిపఱచవలయును, మనకు సరకు అమ్మువారిని, మనసరకు కొనువారిని, మనకొఱకు పని చేయువారిని అందఱను మనము న్యాయముగ తృప్తిపఱచవల

యును.' అని వాణిజ్యపూజ్యుఁడు షై మొఫీ ఈటన్ అనును.

ఒకసారి ఒక బ్రాంచి దుకాణమునకు తప్పువాల్ పోస్టర్లు పంపఁబడెను. వానిని ఆ బ్రాంచి దుకాణమువారు గోడలకు అంటించిరి. కాని ఇంతలో హెడ్ ఆఫీసులో తప్పు కనుగొనఁబడెను. అప్పుడు ఆ తప్పుసు వాల్ పోస్టర్లను గీకించివైచి వానిస్థానమున సరియైనవి అంటించిరి. ఈ తప్పు సవరించుటకు అయిన ఖర్చుఅంతయు హెడ్ ఆఫీసువారు భరించుటయే కాక అనవసరముగ శ్రమ కలిగించినందులకు బ్రాంచి దుకాణము వారిని క్షమాపణ కోరిరి.

షై మొఫీ ఈటన్ దుకాణమునకు అనుబంధముగ హోటలు ఒకటి కలదు. ఆ హోటలులో దినమునకు సగటున ఐదు వేలమంది భోజనములు చేయుచుందురు.

దుకాణమున ఏ.పి. వ్యాపారయుసుండెడి కలదు. ఏఁడాది ఏఁడాదికి కేటలాగు ముద్రింతురు. ఆ కేటలాగు ఆఱువందల పుటలది.

దుకాణములే కాదు ఈటన్‌కు ఫ్యాక్టరీలును కలవు. బట్టల నేతమిల్లులు ; దుస్తులు తయారుచేయు మిల్లులు ; కుట్టుపని దారము, ఎంబ్రాయిడరీ, కర్రసామానులు, వాసనద్రవ్యములు, ఔషధములు, స్కూలుపుస్తకములు, సబ్బులు మున్నగువానిని తయారుచేయు ఫ్యాక్టరీలు ఈటన్ వ్యాపారవిస్తృతిని ఈలఁ గొట్టుచుండును.

ఏ రకము వస్తువులు ఐనను నికార్సు అయినవి లభించనిచో వానిని తయారుచేయుటకు ఈటన్ స్వయముగ ఫ్యాక్టరీని స్థాపించువాఁడు. స్వయముగ ఫ్యాక్టరీ స్థాపించి మంచి సరకు తయారుచేసి విక్రయించువఱకు అతనికి తృప్తి అనునది

ఉండునదికాదు. వాణిజ్యపూజ్యుల తీరు అట్టిది. కదా!

అతఁడు రొక్కమునకే విక్రయించును. కాని కాతాదారులు అరువుకుకూడ వస్తువులు పొందుటకు వీలుకలదు. అట్టివారు కంపెనీలో కొంతసొమ్ము ధరావతు కట్టవలయును. అట్టి డిపాజిట్టు పయి నూటికి ఐదువంతున వడ్డీ ఆ కంపెనీవారు ఇచ్చెదరు.

అతని వ్యాపారమును అంతను ఒక సలహాసంఘము పరీక్షించుచుండను. సలహాసంఘమున పదునెనమండుగురు సభ్యులు. కంపెనీ మేనేజర్లు బాలట్ పద్ధతిని ఈ సలహాసంఘ సభ్యులను ఎన్నుకొందురు. సలహాసంఘసభ్యులు మాసమునకు రెండుసారులు సమావేశము అగుదురు.

సలహాసంఘమునకు ఎట్టి అధికారమును లేదు. అది సలహామాత్రము ఇచ్చును. కాని దానిసలహాను సాధారణముగ డైరెక్టరు బోర్డువారు చేకొందురు.

వైమోథీ ఈటన్ ౧౯౦౭-వ సంవత్సరమున చనిపోయెను.



## ౧౪
## ఛార్లస్ ముర్రే

మోటారురాజు హెన్రీఫోర్డు నామము వినని వారెవ్వరు? అతని పట్టణము డెట్రాయిట్. ఆ డెట్రాయిట్ పట్టణమున స్కాట్ జాతికి చెందిన యువకుఁడు ఒకఁడు నివసించుచుండెను. అతని నామము ఛార్లస్ ముర్రే. అతఁడు ఇన్సూరెన్సు ఏజెంటు.

ప్రపంచమున ఎంతమంది ఇన్సూరెన్సు ఏజెంట్లు లేరు! కోటానకోట్లుగా ఉండిన ఇన్సూరెన్సు ఏజెంట్లలో అతని విషయమున ఏమైన ప్రత్యేకత ఉన్నదా?

ఉన్నది కావుననే అతని ప్రశంస ఇచట చేయనైనది.

డెట్రాయిట్ నందలి హెన్రీఫోర్డు మోటారు ప్రపంచమున రికార్డుకొట్టినాడు. డెట్రాయిట్ నందలి ఛార్లస్ ముర్రే ఇన్సూరెన్సు ప్రపంచమున ఇటీవల రికార్డుకొట్టినాడు. కొట్టి అతడు ఆదర్శప్రాయుడగు భీమాఏజెంటు ఆయెను.

నూట ఒక్క దినములు తెంపులేక ప్రతి ఒక్కొక్క దినమును అతడు కనీసము ఒక్కొక్క భీమాపోలసీనైన అమ్మినాడు. దినమునకు కనీసము ఒక భీమాపోలసీనైన అమ్ముచు నూటఒక్క దినములు తెగని వ్యాపారము చేసిన ఇన్సూరెన్సుఏజెంటు ప్రపంచచరిత్రలో మఱియొకడు లేడు.

నూట రెండవదినమున మాత్రము అతడు భీమా పోలసీని ఒక్కదానినైన అమ్మలేకపోయినాడు.

నూట రెండవదినము వచ్చువఱకును గతించిన దినములన్నిటియందును దినమునకు కనీసము ఒకటైన భీమాపోలసీని అమ్ముచు వచ్చినాడు. ఇది అతడు ఎట్లు చేయగలిగినాడు? ఆ ముఖ్యవిషయమును తెలిసికొనుటయందే మన మనములు ఇపుడు లగ్నములై ఉండుట సహజము.

తన మిత్రులలో, పరిచితులలో, బంధువులలో భీమాపట్టా కొనగలవారని తనకు తోచిన నూటఏబదిమంది నామములను పట్టికగా అతడు మొదట తయారుచేసినాడు.

పిమ్మట తన మిత్రులకు లేఖలు వ్రాసినాడు: భీమాపట్టాలు కొనగలవారి నామములు తెలుపుడని. కాని ఆ

మిత్రులవలన కొద్దిసాయము మాత్రము వచ్చినది.

అప్పుడు అతడు వారిని స్వయముగ చూచుటకు ద్వార కొనినాడు. ఉత్తరముల పద్ధతికంటె ఈపద్ధతి బాగుగా పని చేసినది. ఒక్కొక్కరు తమకుతోచిన కొన్నికొన్ని పేళ్ళు సూచించిరి.

మఱునాడు చేయవలసిన పనినిగూర్చి అతడు ఈ రాత్రియే నిశ్చయము ఒనర్చుకొనువాడు. తనకాలమున ప్రతి ఒక్క గంటను అతడు ఉపయోగించుకొనువాడు. దినమునకు కల ఇరువదినాలుగు గంటలలో ఎనిమిదిగంటలకు తగ్గకుండను, పండ్రెండుగంటలకు మించకుండను అతడు పనిచేయువాడు. ఆదివారములందు కాని, సెలవుదినములందుకాని పనిచేయు వాడు కాదు.

ఒకసారి అతడు ఉదయము ఆరుగంటలకే ఒక భీమా పట్టాను అమ్మకలిగెను. ఎవరికి? తనకు పాలు అమ్మువానికి. ఎంతమొత్తమునకు? రెండువందల పౌనులకు. స్నానపు తొట్టిలో ఉండగా అతనికి ఆ భావము పొడచూపెను. తోడనే వచ్చి తన పాలవానికి నచ్చచెప్పి పోలసీని విక్రయించెను.

'జీవిత భీమావ్యాపారమున ప్రతివాడును కొనుగోలు దారే' అని ముర్రే చెప్పును. అతడు ఒకసారి ఒక సామాన్య ఫాక్చరరీను చూడ వేచిఉన్న కాలమున అచటి టైపిస్టునకు ఒకనికి ఒకభీమాపట్టాను విక్రయించెను.

తాను నచ్చచెప్పుటచేత ఎన్నిపట్టాలు విక్రయింపగలి గెనో ఇతరులు చెప్పునది లెస్సగ వినుటచేతకూడ అతడు అన్ని పట్టాలు విక్రయించెను. వారి వారి కుటుంబపరిస్థితులను కూర్చియు, వారివారి ఆర్థికసమస్యలను కూర్చియు తనతో

సావకాశముగ చెప్పుకొననిచ్చువాఁడు. పిమ్మట నెమ్మదిగ వారి వారికి అనువైన ఉండు పోలసీని సూచించి వారిచే కొనిపించు వాఁడు.

తాను పోయినచోట తనకు చేయఁబడిన స్వాగతమును ఆతఁడు ఎప్పుడుకాని చాలసేపు ఉండిపోవుటచేత పాడుచేయు లేదు. కూడినంత కాలముండి అప్పటికి వెడలిపోయి తిరిగి మఱి ఒకప్పుడు వచ్చువాఁడు. ఇన్సూరెన్సు ఏజెంట్లు ఈ విషయమును తఱుచు విస్మరింతురు. తన రాకచే కాని, తన ఉనికిచే కాని ఎవరి ఇంటియందును ఎట్టి చీకాకుకాని, చీఁదఱకాని కలుగకుండునట్లు అతఁడు మిక్కిలి మెలుకువ వహించువాఁడు.

మొదట ఆతఁడు రైల్వేస్టేషన్‌లో టిక్కెట్లు అమ్ము వాఁడుగా ఉండినాఁడు. అక్కడ విశేషముగ విక్రయము లేకుం డుటచే వస్తువిక్రయరహస్యములను బోధించు పుస్తకములను, పత్రికలను కొని చదువ ప్రారంభించెను. కొంతకాలమునకు పిమ్మట భీమాపట్టాల విక్రయమునకు దొరకొన నిశ్చయించెను.

రెండు నిండుసంవత్సరములు ఇన్సూరెన్సు విషయిక గ్రంథములను పఠించెను. వలయుజ్ఞానము కలిగినపిమ్మట రైలు టిక్కెట్లు అమ్ము ఉద్యోగమునకు రాజీనామా ఇచ్చి ఒకానొక ఇన్సూరెన్సుకంపెనియందు ఏజెంటుగా కుదిరెను.

ఇన్సూరెన్సుఏజెంటుగా అతఁడు పురుషప్రయత్నము చేతనే జయమందెను. తాను చేయవలసినపనికి గ్రంథపఠనముచే అతఁడు లెస్సగ తయారయ్యెను. తయారై కార్యరంగమున ప్రవేశించి అతఁడు ఇన్సూరెన్సు విక్రయమును హుటాహుటిగా, ఆదర్శప్రాయముగా సాగించెను.

౧౯

# యం. బి. స్కాగ్సు

తేయాకు, కాఫీవిత్తులు మొదలగు పలుసరకులు అమ్ము వర్తకులు సాధారణముగ సాహసోపేతులై ఉండరు. సాహసము కొఱవడి ఉండుటచేత వారు తమదుకాణము లను పెంచక కొద్దిలాభములకే సంతృప్తులు అగుచుందురు. వర్తకము విస్తరించి చేయవలయునను అభిలాష వారికి ప్రాయకముగ ఉండదు.

పలుసరకుల వర్తకుల ఈ తీరునకు విరుద్ధముగా వర్తించినవాడు ఒకడు కలడు. అతని నామము యం.బి. స్కాగ్సు.

౧౯౩౦ నాటికి అతడు నలుబది వత్సరములవాడు. అయినను అప్పటికే అతడు అమెరికాఖండమున పశ్చిమ భాగమున మూడువందల ఏబదియేడు పలుసరకుల దుకాణములకు యజమానియు, వ్యవహర్తయు ఐ ఉండెను.

౧౯౨౯-వ సంవత్సరమున అతని మూడువందల ఏబది ఏడు దుకాణముల అస్నిటిలోను ఏబది లక్షల పౌనుల పలుసరకులు అమ్ముడువోయెను.

ఇతర వర్తకులకంటె స్కాగ్సు ఒక్కొక్క ఖాతాదారునకు సగటున హెచ్చుసరకు అమ్మునని ప్రతీతి పాదుకొని పోయినది.

అయినను పుట్టుకలో స్కాగ్సు కటికదరిద్రుడు. అతని తండ్రి మతగురువు (పార్సన్). ఆ గురువు జీతము కొద్దిపాటిది.

కుటుంబము పెద్దది. అతనికి పంద్రెండుగురు పిల్లలు.

పదునాలుగేండ్ల-బాల్యముననే యం.బి. స్కాగ్సు సొంత సంపాదనకు కడంగెను. ఒకానొక పలుసరకుల అంగడిలో వారమునకు ఆఱుషిల్లింగుల జీతముమీఁద పనికి కుదిరెను.

పందొమ్మిది ఏండ్ల చిన్నతనమున ఆతఁడు స్వాయముగ ఒకచిన్న దుకాణమును ఏర్పఱచెను. ఏడుసంవత్సరములు అతఁడు ఆ దుకాణము నిర్వహించెను.

ఆ దినములలో స్కాగ్సు విశేషలాభమును ఆర్జింపలేదు. ఇతర పలుసరకు వర్తకులవలెనే అప్పుడు ఆతఁడు దుకాణము పడిపోకుండ నడుపుచు కొద్దిలాభమును మాత్రము పొందుచుండువాఁడు.

పలుసరకులమ్ము దుకాణదారులు లోనగు కష్టనిష్ఠురములకు అన్నిటికిని ఆతఁడుకూడ లోనగుచుండెను. ఐనను బండి తాజాగా నడచిపోవుచుండునది.

తనస్థితి గొఱ్ఱతోఁకవలె ఎదుగుబొదుగులు లేకుండుట ఆతఁడు ౧౯౧౫ లో గ్రహించెను. మార్పుచేసి దుకాణమున విశేషముగు అమ్మకము సాగించి గొప్పలాభము తీయవలెనని అతఁడు సంకల్పించెను.

సంకల్పము కలుగుటయే తడవుగ ఆతఁడు ఒకతోఁట యజమానివద్దకుపోయి ఒక రైలువాన్ నిండిన పీచ్ పండ్లను కొనెను. ఆతనిదగ్గర సొమ్ములేదు. కాగా ఏనాఁడు అమ్మిన పీచ్ పండ్లసొమ్ము ఆనాఁడు బ్యాంక్ చెక్ రూపముగ పంపుటకు ఖరారు చేసికొనెను.

సరకు తన దుకాణమునకు ఇంకను చేరకుండగనే తన వద్ద పీచ్ పండ్లు అమ్మకమునకు కలవను విషయమును కరపత్ర

ముల మూలమున పట్టణము అంతయు అతఁడు ప్రచారము చేసెను. పెద్ద మొత్తముగ కొన్న కారణమున అతఁడు ఆపండ్లను చౌక ధరకు అమ్మఁజూపఁగలిగెను.

పీచ్ పండ్ల వాగన్ స్టేషన్‌కు చేరుసరికి కొనుగోలు దారులు నెట్టుకొని వచ్చిరి. అక్కడే అప్పుడే ఆపండ్లు విక్రయమైపోయెను.

అమ్మకపు ప్రసాదము తోఁటయజమానికి పంపినైచి మతీ మూఁడు పీచ్ పండ్ల వాగన్‌లకు అతఁడు ఆర్డరు ఇచ్చినాఁడు.

అటుపిమ్మట స్టాగ్సు కాబేజీలను రైలులో వాన్‌ల కొలఁది తెప్పించెను. అమెరికా దేశపు రైలువాన్‌లు మిక్కిలి పెద్దవి. మన రైలువాన్‌లకు అవి నాలుగురెట్లు ఉండును. స్టాగ్సునకు ఇప్పుడు సరకు అట్టి వాన్‌లకొలఁదిగ వచ్చుచుండెను.

అచిరకాలముననే వారమునకు ఆఱువందల పౌనుల అమ్మకము కల వ్యాపారమునకు అతఁడు కామందు ఆయెను.

'ఈ యదనున నాకు ఇంకను దుకాణములు ఉన్నచో ఇంకను హెచ్చుసరకు అమ్మఁగలిగి ఉండును.' అని అతఁడు అనుకొనెను.

అప్పటినుండి అతఁడు దుకాణములనే కొనుటకు ప్రారంభించెను. ౧౯౩౦-వ సంవత్సరమునాఁటికి అతఁడు మూఁడువందల ఏఁబదిఏడు దుకాణములను కొనెను. కాగా అతఁడు పండ్లను తోఁటలలోనే పెద్దపెద్ద మొత్తములకు కొనుగోలుచేయ ప్రారంభించెను.

'కాతాదారులు దుకాణమున ఏసరకైనను విస్తారముగ ఉండుటను కాంక్షింతురు. ఏఁబది నారింజలుగల ఒకతొట్టి

కంటె అట్టివి నిలుబడితోట్లు దుకాణమును ఎక్కువ ఆకర్ష ణీయముగ చేయఁగలవు' అని స్కాగ్సు అనును.

స్కాగ్సు దుకాణములందు వెనుకతట్టున ఒకే గళ్ళా పెట్టి ఉండును. అక్కడనే సరకు తూఁచఁబడి పొట్లములుగాని, సంచులలోకాని జాగ్రత్తచేయఁబడి కాతాదారులకు ఒసంగఁబడును.

దుకాణమునందు మధ్యభాగమున సరకు గుట్టలుగుట్టలుగా, రాసులు రాసులుగా పోయఁబడి ఉండును. పర్వతముల వలె పండ్లగుట్టలు.

తక్కువధరకు ఎక్కువ వస్తువులను కొనుటను కాతాదారులకు స్కాగ్సు నేర్పెను. పావుపౌను తేయాకు, పావుడజను అరటిపండ్లు—ఈ మాదిరిగ అమ్ముట ఆతనికి నచ్చను. పూఁటబత్తెముగ కొనుపద్ధతియు ఆతనికి కిట్టదు. పెద్దమొత్తముగ సరకును కొనుటను కాతాదారులకు ఆతఁడే నేర్పినాఁడు.

పలుసరకుల దుకాణములనుండి వెలువడు పరిమళమును ఆతఁడు ఎంతయో ప్రేమించును. అన్నిటికంటె ఆతనికి కాఫీ వాసన అనిన ఆప్యాయత హెచ్చు.

తన మూడువందల ఏఁబదిఏడు దుకాణములలో ప్రతి దానియందును ప్రతి అరగంటకును ఒక్కొక్క పౌను కాఫీ పొడిచేయఁబడుచుండవలసినదే అని అతని ఆజ్ఞ.

అందఱును కాఫీవాసనకు ప్రియము పడుదురు. కాఫీ వాసన తగులుటతోడనే ప్రతివారి తలఁపును భోజనపదార్థముల పైకి పోవును. ప్రతివారి తలఁపును భోజనపదార్థముల మీఁదికి పోవుటవలనకదా, పలుసరకులు అమ్ము దుకాణదారు కోరఁదగినది, కోరునది!

పలుసరకులు అమ్ము మూడువందల ఏఁబదిఏడు దుకాణములకు యజమానుఁడు, నిర్వాహకుఁడు అయిన స్కాగ్సు విశేషమేధావి కాఁడు. అతని ఛాయాపటము చూచితిమేని అతఁడు అతిసాధారణుఁడు అగుట తెలియవచ్చును. ముఖము మాత్రము అతని దృఢసంకల్పమును వెల్లడిచేయును. దుస్తులు సామాన్యమైనవి కాని విశేషమైనవి కావు. పెట్టిన టోపీ గుడ్డతో తయారైనది.

విశేషమేధావి కాకపోయినను, అతిసాధారణుఁడు అయినను అతఁడు పెద్దవ్యాపారము చేయుటకు సాహసించినాఁడు. చిన్నవ్యాపారమును చేయుటతో అతఁడు తృప్తిపడి ఉండలేదు. కావుననే అతఁడు ఏఁడాదికి ఏఁబదిఆఱు లక్షల పౌనుల విలువగల సరకును విక్రయించుచున్నాఁడు.

అతని పద్ధతి ఇది :

'తాను అమ్మకలిగిన సరకుకంటె, హెచ్చుసరకును కొనుట. కొని దానిని విక్రయించితీరుట.'

దుకాణములకు దుకాణములే కొనుట—

తాను అమ్మకలిగిన దాని కంటె ఎక్కువసరకు కొనుట-

కొనినసరకును అంతను విక్రయించి తీరుట—

ఇవి యం.బి. స్కాగ్సు తీరులలో ముఖ్యమైనవి.

పలుసరుకుల దుకాణములో పనికికుదిరి అతఁడు మూడు నాలుగేండ్లు అనుభవము సంపాదించి పందొమ్మిదేళ్ళ బాల్యమున సొంత అంగడిపెట్టి ఇరువదియేండ్లలో వాణిజ్యలోకమున అతిలోకుఁడైనాఁడు.

—••••••—

౧౬

# లీవర్ హ్యూమ్

అరువది ఐదేండ్ల క్రితము సంగతి. పలుసరకులు అమ్ము ఒకానొక దుకాణములో ఒక పేదబాలుఁడు జీతమునకు కుదిరి ఉండెను.

అతని నామము విల్ లీవర్.

ఆ బాలుఁడే పెద్దవాఁడై సన్‌లైట్ సబ్బుకంపెనీ యజమాని ఐ చనిపోవుసరికి ఏడుకోట్ల పౌనుల విలువగల వ్యాపార సంస్థకు అధ్యక్షుమహాశయుఁడై ఉండెను.

ఇంతకును ఆతఁడు విద్యావంతుఁడు కాఁడు. కడకాలము వఱకును అతనికి ఎట్టి బిరుదముకాని ప్రసాదితము కాలేదు.

అతనిది పోటీలేని వ్యాపారమైనను కాదు. ఇతర వర్తకులకు లేని అనుకూలములు ఏమియు అతనికి ఒనకూడలేదు. ప్రత్యేకసౌకర్యములు ఎట్టివికాని అతనికి లేకుండెను.

అయినను అతఁడు ఏఁడాదికి ఏఁబదిలక్షల పౌనుల లాభము తీయు వాణిజ్యపూజ్యుఁడు ఐనాఁడు.

అతఁడు ఈ అపారధనసంపత్తిని గవర్నమెంటు కంట్రాక్టులు చేసి సంపాదించలేదు. అనుచితలాభమును పొందు దృష్టితో అతఁడు ఎప్పుడును వ్యాపారము చేయలేదు.

తాను అమ్ము ప్రతివస్తువును నికార్సుగ తయారుచేసినాఁడు. చేయుటలో అగుఖర్చును ఉపాయముచే తగ్గించుచు వచ్చినాఁడు. పెన్నీలు, ఫా[illegible]గులు మున్నగు చిన్ని నాణెములనుండియే అతని అపారధనము సముపార్జితమైనది.

అతఁడు ఇది ఎట్లు చేసినాఁడు?

ఈ ప్రశ్నకు ఒక్క వాక్యములో జవాబు చెప్పవలసి ఉండునేని ఇట్లు చెప్పఁదగును.

'ఎట్లు చేయవలయునో తనకు బాగుగ తెలిసినదానినే చేయుచు నిండు ఏఁబది సంవత్సరములు పురోగామియై త్వరగమనమున పోవుట చేత.'

త్వరగమనము! లీవర్ హ్యూమ్ నిఘంటువులో త్వరగమనమునకు అర్థము ప్రతిదినమును ఉదయమున ఐదుగంటలకే లేచుట. అనగా ఏమి? దినమునకు అంతటికి చేయవలసిన పనిని మధ్యాహ్నమునకే ముగించుకొనుట.

తన ఆస్తిపాస్తులను తనకళ్ళతో చూచుటకు తిరుగుచు ప్రయాణముచేయుట—వెఱపు, వెనుఁబాటు, అనుమానము లేకుండ ముందుకు చొచ్చుకొనిపోవుట—ఇవి లీవర్ హ్యూమ్ పరిభాషలో పురోగామిత్వమునకు పర్యాయపదములు.

పురోగామి, త్వరగామి ఐన లీవర్ హ్యూమ్ ఇతరకంపెనీలను కొనువాఁడు. దివాలాస్థితిలోనుండి వానిని ఉద్ధరించి లాభసాటిగ చేయువాఁడు. అపాయశంక కలిగి వెరపుమాలిన వారివద్ద అతఁడు కంపెనీలు విలుచువాఁడు. అట్టివారివద్ద కంపెనీలు కొనుటకు అతఁడు ముచ్చటపడువాఁడు. ఏమన అట్టివారు మిక్కిలి తక్కువధరకు విక్రయింప నిచ్ఛగింతురు కనుక.

భయసంకోచములకు గుఱియైన కంపెనీలవారు ఎల్లరు లీవర్ హ్యూమ్ వద్దకుపోయి తమకంపెనీలను అమ్ముకొనువారు. కంపెనీలమీఁద కంపెనీలు కొనినాఁడు అతఁడు. మొత్తము మీఁద రెండువందల కంపెనీలను విలిచినాఁడు.

తన జీవితకాలమున అతఁడు ఎప్పుడుకాని, ఎందుకుకాని భయసంకోచములకు గుఱిఅగుట ఎట్టిదో ఎఱుఁగఁడు.

తనకు తెలిసినదాని విషయముననే అతఁడు శ్రద్ధధానుఁడై ఉండినాఁడు. సబ్బుల పరిశ్రమనే అతఁడు ఆదినుండి అంతమువఱకు అంటిపెట్టుకుని ఉండినాఁడు. సబ్బులు చేయుటకు పనికివచ్చు కొవ్వుకొఱకు అతఁడు ప్రపంచము అంతయు పరికించినాఁడు. కొవ్వుకొఱకు అతఁడు ఆఫ్రికాలో ఎనుబదిలక్షల పౌనులను పెట్టుబడి పెట్టినాఁడు.

బ్రతికిన, బ్రతుకుచున్న, బ్రతుకఁబోవు ఏమానవునికంటెకూడ లీవర్‌హ్యూమ్ తన సబ్బులచే ప్రపంచమును ఎక్కువ శుచిగా చేయుటకు సహకారి ఐనాఁడని చెప్పవచ్చును.

గమనింపఁదగిన మఱియొక విషయము.

వ్యాపారమున అభివృద్ధి కలుగుకొలఁదిని అతఁడు స్వార్థపరుఁడు కాలేదు. తనపనివాళ్ళనుకూడ తనతో ఉత్పథమునకు కొనిపోయినాఁడు. తన పనివాళ్ళనే తన భాగస్వాములుగ చేసికొనినాఁడు. కంపెనీకి వచ్చులాభములను పనివాళ్ళతో పంచుకొనినాఁడు. కాని స్వార్థపరుఁడై తనపెట్టె నింపుకొనుటకే విని యోగించుకొనలేదు.

కంపెనీ యజమానిగ అతఁడు మిక్కిలి ఉదారభావపూరితుఁడై ఉండెను. నేఁడు శ్రీఘుయూనియనిస్టులు, సోషలిస్టులు చెప్పు సిద్ధాంతములను ఎన్నిటినో అతఁడు అనాఁడే ఆచరణయందు పెట్టెను.

అతఁడు చనిపోవుసరికి అతని కంపెనీకి పదునెనిమిదివేలమంది భాగస్వాములు, ఒకలక్షఱులుపదిఱులువేలమంది వాటాదారులు ఉండిరి.

వ్యాపారమువలన తనగృహమునకే కాక మఱిరెండు లక్షల గృహములకుకూడ అతఁడు సుఖమును, రక్షణను కొని వచ్చినాఁడు. ఒకవ్యక్తి విషయమున ఇంతకంటె చెప్పతగిన యోగ్యవిషయము ఏమి ఉండును?

లీవర్ హ్యూమ్ జయమునకు కారణభూతములైన ముఖ్య విషయములు మూడు.

ఒకటి :

పదునైదు షిల్లింగులు ఆర్జించుకొఱకు అతఁడు ప్రకటనలక్రింద పదిషిల్లింగులు వెచ్చించును. ప్రకటనకొఱకు ఇంతటి విశేషవ్యయమును చేయువాఁడు మఱియొకఁడు ఎవ్వఁడైన ఉన్నాఁడా? బ్రిటీష్ సామ్రాజ్యమునందు అంతటను వ్యాపార విషయమున ఇంతటి విస్తారప్రకటన చేయువాఁడు మఱియొకఁడు లేఁడు.

రెండు :

అతని కంపెనీకి డైరెక్టర్ల బోర్డు కాని, కమిటీలు కాని లేవు. కమిటీలయందు, కాన్ఫరెన్సులయందు అతనికి నమ్మకము లేదు. కార్యాచరణమునందే అతఁడు పూర్తిగ విశ్వాసముంచినాఁడు. ఇతర వ్యాపారులవలె అతఁడు డైరెక్టర్ల బోర్డునకు కట్టుఁబడలేదు. అతని వ్యాపారమున అతనికి స్వేచ్ఛ. అతఁడు స్వతంత్రుఁడు.

మూఁడు :

ప్రతి పనిని అతఁడు పెద్దఎత్తున చేయువాఁడు. తగ్గించుట, కుంచించుట అతనికి కిట్టవు. దినమునకు సగకాలమే పని చేయుట మున్నగు వెట్టులు అతనికి లేవు.

నీ వ్యాపారపద్ధతి ఎట్టిదని ఒకసారి స్నేహితుఁడు ఒకఁడు అతనిని ప్రశ్నించినాఁడు.

దానికి అతఁడు ఇట్లు బదులిడినాఁడు:

'నీవు నమలకలదానికంటె ఎక్కువ ముక్కను కొఱికి దానిని నమలివేయుము అను కవివాక్యము నా పద్ధతిని విపులీకరించును.'

ప్రక్కచూపేకాదు అతనికి ముందుచూపుకూడ ఉండునది. ఆతని దృష్టి ఎల్లవేళలయందును అభివృద్ధిని చూచునది. ఇతరులు నలుబదిపౌనులు వచ్చునని ఉద్దేశించినచోట ఆతఁడు నూరుపౌనులు వచ్చునని నిశ్చయించువాఁడు. ఇతరులు గడ్డిపోఁచలను చూచినచోట ఆతఁడు వటవృక్షములను చూచినాఁడు.

ఏఁడాదికి ఏఁబదిలక్షల పౌనుల లాభమును ఆర్జించు కంపెనీని ఆతఁడు నిర్మించినాఁడు. వ్యాపారముతోపాటు ఆతని వ్యక్తియు అభివృద్ధిని అందినది. తన వ్యాపారము ఎంతటి హుటాహుటి నడలతో ముందుకు సాగినదో అతఁడును అంతటి హుటాహుటి నడలతో ముందుకు సాగినాఁడు.

అతఁడును, అతని వ్యాపారమును కలసియే అభివృద్ధిని అందినట్లు చెప్పవలసి ఉండును. ఐనను ఆతఁడు ఎప్పుడును పురోగామియే ఐ ఉండువాఁడు.

కావుననే ఆతనిని ప్రజలు కోటీశ్వరుఁడు అను దృష్టితో కాక మానవమాత్రుఁడే అనుదృష్టితో చూడకలిగినారు.

ఆతని వ్యాపారవిజయమునకల రహస్యము ఇదియే.

---

# ౧౭
# శాండర్సు నార్వెల్

అతని నామము శాండర్సు నార్వెల్; అతని వృత్తి వస్తువిక్రయము; అతని ఉనికి అమెరికాఖండపు సంయుక్త రాష్ట్రములలో.

ఆంగ్లసామ్రాజ్యపు రాజధానినగరమగు లండను నందును, పరాసుసామ్రాజ్యపు రాజధానినగరమగు పారిస్ నందును వర్తకసంఘమున ప్రతివారును అతనినామము బాగుగ ఎఱుఁగుదురు.

౧౯౩౦ ప్రాంతమున శాండర్సు నార్వెల్ రెమింగ్టన్ ఆరమ్సు కంపెనీకి అధ్యక్షుఁడుగ నియమితుఁడు ఆయెను.

చిన్నటనాఁట నార్వెల్ తాను ఒక చిత్రకారుఁడు కావల యునని కుతూహలపడినాఁడు. లలితకళలకు కాణాచియగు పారిస్ మహాపట్టణమునకు పోయి చిత్రకళ అభ్యసింపవలయు నని అతఁడు అగ్గలముగ అభిలషించినాఁడు. కాని వలయు ధనము లేకపోయినది.

జీవిక సాగుటకు ఇనుపసామానులు అమ్ము కంపెనీలో రవాణాగుమాస్తాగా అతఁడు చేరవలసి వచ్చినది.

కాని ఒక సుగుణము. గుమాస్తాగా అతఁడు చిరకాలము కుమిలిపోవలేదు. అచిరకాలముననే అతఁడు ఆ కంపెనీలో వస్తువిక్రేత అయ్యెను. ఇరువది ఎనిమిదవఏఁడు పైఁబడు సరికి అతఁడు ఆ కంపెనీలో సేల్సుమేనేజరు పదవిని అధిష్ఠించెను.

వస్తువిక్రేతగా అతని అభివృద్ధి అద్భుతమైనది. ఏఁడా దికి రెండులక్షల పౌనుల చొప్పున పదియేండ్ల పర్యంతము అతఁడు తనకంపెనీలోని వస్తువుల అమ్మకమును పెంపొందించెను.

ప్రతి వస్తువిక్రేతయు చేయవలసిన ప్రధానకృత్యములు మూఁడు కలవని అతఁడు అనును. అవి వినుట—చూచుట—జ్ఞప్తియందు ఉంచుకొనుట—అనునవి.

వస్తు విక్రయమునకు సరియగు మార్గము కొనుగోలు దారు చెప్పునది వినుట కాని వస్తువిక్రేత ఉపన్యసించుట కాదని అతఁడు చెప్పును. 'ఇతర ఉద్యోగులవలనకంటె సలహా చేసియు, భోగట్టా అడిగియు నేను విస్తారముగ వస్తువులు విక్రయించి ఉన్నాను' అని అతఁడు చెప్పును.

వస్తు విక్రయావసరమున అతఁడు తన నాలుకకంటె కన్నులను, చెవులను ఎక్కువగ ఉపయోగించును. అన్నిటిని లెస్సగ గమనించును. కొనుగోలుదారుల పేళ్ళను బాగుగ జ్ఞప్తి యందు ఉంచుకొనును. వస్తువులు విక్రయించుటయందు ఎంత కాలమును వెచ్చించునో అంతకాలమును సంగతులు తెలిసి కొనుటయందును వెచ్చించును.

కారణముగ అతని యాజమాన్యమున వస్తువిక్రయము విశేషముగ విస్తరిల్లినది.

అమ్మకములో విసుగుదల అనునది ఒకటి ఉన్నదని ఆ అనుభవజ్ఞుఁడు చెప్పును. అగుటనే ఏ ట్రావెలింగుఏజెంటు అయినను తాను తిరిగెడు ప్రదేశములలో అన్నిటియందును ఒకేమాదిరిగ వస్తువిక్రయము కావింపఁజాలఁడు; తనవద్ద అమ్మ కమునకు ఉన్న అన్నివస్తువులను ఒకేమాదిరిగ విక్రయింపఁ జాలఁడు.

అతఁడు ట్రావెలింగు ఏజెంటుగ ఉండినపుడు డెబ్బది ఐదు వేల రకముల ఇనుపసరకుల కేటలాగునుండి వస్తువిక్రయము చేయవలసి ఉండునది. ఆ కేటలాగు తూకమే నలుబదిపౌనులు.

ఆ కేటలాగులోని మూఁడు భాగములలో మొదటిభాగమునందలి వస్తువులనే విస్తరించి అమ్మకలుగుచుండినట్లు ఆతఁడు గుర్తించినాఁడు. తాను, ఖాతాదారులు కేటలాగు సగము వఱకు తిరుగవైచుచు పోవుసరికి విసుగువచ్చునది. కేటలాగులోని మిగిలిన పత్రములను విసుగుతో తిప్పివైచువారు. విసుగుతో తిప్పివేయఁబడుచుండు పత్రములలోని వస్తువులకు ఆర్డరులు ఎట్లుండును?

చతురమతి అగు శాండర్సు నార్వెల్ ఈలోపమును గమనించినాఁడు. కావున కేటలాగు తిరుగవేత ఒక్కొక్కప్పుడు వెనుకనుండి ముందుకు—అటునుండి ఇటు—జరుగునది. ఒక్కొక్కప్పుడు తిరుగవేత కేటలాగు మధ్యలో ప్రారంభమగునది. ఈ విధానమువలన కేటలాగులోని అన్నివస్తువులకు—మొదటివి, నడుమవి, చివరవి అను భేదములేకుండ అన్నివస్తువులకు—ఆర్డరులు ఉండునవి.

వస్తువిక్రయవిస్తృతికి అతఁడు అవలంబించిన మఱియొక విధానము: ఒక్కొక్క మాసమున ఒక్కొక్క ప్రత్యేక వస్తువు విక్రయమున శ్రద్ధచూపుట. ఏఁడాదికి పండ్రెండు వస్తువుల విక్రయమున ప్రత్యేకశ్రద్ధ. ఈ విధానమువలన కంపెనీకి ఏ నెలలోకాని వ్యాపారమాంద్యము అనునది ఉండునదికాదు.

వస్తువిక్రేత సర్వదా ప్రాప్తకాలజ్ఞుఁడు కావలయును. ఏ సమయమునకు ఏది అవసరమో సూక్ష్మముగా గ్రహించి ఆ సమయమున దానిని బజారున పెట్టవలయును. ఆ పెట్టు

టయు కాలవిలంబము కాకుండ నిముసములమీఁద జరుగవల యును. సేల్సుమాన్ అగువాఁడు వినువాని ఇంగితమును కని పెట్టి మాటలాడవలయును. 'ఎప్పటి కెయ్యది ప్రస్తుత మప్పటి కాపలుకు పలికి' వర్తించుట సేల్సుమాన్ అగువానికి ప్రధాన ధర్మము.

ఇట్లని శాండర్సు నార్వెల్ చెప్పెను.

వచ్చిన లాభములో నూటికి ఇరువదియవ వంతైన వస్తువులను ఉత్పత్తిచేయువారలకు పంచిపెట్టవలయునని శాండర్సు నార్వెల్ వచనము. ఈ విధముగ పంచిపెట్టుట ఒక విధమగు పెట్టుబడి అగునేకాని వ్యయముమాత్రము కాదని అతఁడు చెప్పుచున్నాఁడు.

వస్తువిక్రేత సరియగు మార్గమును అవలంబించి పోవుచో ఏ వస్తువునైనను ఎచ్చటనైనను విక్రయింపవచ్చునని శాండర్సు నార్వెల్ సిద్ధాంతము చేయుచున్నాఁడు.

ఒక పితలాటకపు బ్యాంకరునకు అతఁడు ఒకసారి ఒక బంగారపు తాళముచెవిని విక్రయించినాఁడు. ఈ విక్రయము పందెముమీఁద జరిగినది. ఆ బ్యాంకరు బంగారపు తాళపు చెవిని కొనుపాటి ఉదారుఁడుకాఁడు. అయినను నార్వెల్ తన విక్రయసామర్థ్యముచేత ఆ పితలాటకపు బ్యాంకరుచే బంగారపు తాళముచెవిని కొనిపించినాఁడు.

అది ఒక చిత్రగాథ.

తొలుత నార్వెల్ తనకొఱకు ఒక బంగారపు తాళము చెవిని చేయించుకొని దానిని తన జేబు గడియారపు గొలుసున వ్రేలాడతీసినాఁడు. పిమ్మట బ్యాంకరు దర్శనమునకు పోయి నాఁడు. సంభాషణావసరమున బ్యాంకరునకు దానిని చూపి

దాని ధారణము ప్రసాదభావప్రేరితమనియు, ధరించినవారి కళానిరతికి అది మచ్చుగా ఉండఁగలదనియు చెప్పినాఁడు.

బ్యాంకరు హృదయముకూడ ప్రసాదభావప్రేరితమైనది. తన కళానిరతికి మచ్చుగా ఉండుటకై బంగారపు తాళము చెవిని ధరించుట అవసరమని అతనికి తోఁచినది.

తోడనే బంగారపు తాళము చెవికొఱకు ఆ బ్యాంకరు ఆర్డరు ఇచ్చినాఁడు. ఆ ఆర్డరును నార్వెల్ కంపెనీవారే నిర్వహించినారు. అంతియకాదు. నార్వెల్ తనపందెమునుకూడ నెగ్గినాఁడు.

కొనఁ దలఁచనివారిచే కొనిపించుటయేకదా వస్తువిక్రేతల అతిశయసామర్థ్యమునకు యోగ్యతాపత్రము!

నార్వెల్ పదిసంవత్సరములు సేల్సుమేనేజరుగా ఉండినాఁడు. చేరలకొలఁది ధనము ఆర్జించినాఁడు. ఆపైన ఉద్యోగమును విరమించినాఁడు.

ఇంతకాలమును అతని మనము చిత్రకళాభ్యసనము పైననే లగ్నమై ఉండినది. ఇపుడు అతఁడు పారిస్ మహాపట్టణము వెళ్ళినాఁడు. చిత్రకళాభ్యసనమునకు దొరకొనినాఁడు.

ఆ అభ్యసనము కొద్దికాలమే సాగినది. దానియందు అతని చిత్తము నిలకడ వహింపలేదు. కాగా చిత్రకళపై మోజు అచిరకాలముననే తగ్గిపోయినది. మోజు తగ్గుటయే కాదు. చిత్రకళ అనిన విసుగుకూడ పుట్టినది.

తిరిగి అమెరికాకు పోయినాఁడు. వ్యాపారమున ప్రవేశించినాఁడు. చిత్రకళకంటె వస్తువిక్రయమే అతని చిత్తమునకు ఎక్కినపని ఐనది.

ప్రపంచమున అన్నివృత్తులకంటె వస్తువిక్రయవృత్తి

చమత్కారమైనదని అతని తలంపు. వస్తువిక్రయవృత్తి అవలంబించుటవలన ఒకనికి లోకము వారితో పరిచితి ఏర్పడును.

వస్తువిక్రేత లోకజ్ఞానము విశేషమైనదిగాను, అనుభవము అపూర్వమైనదిగాను ఉండును. అతని తెలివితేటలు అనుదినము ప్రవర్ధమానములు అగుచుండును.

---

# ౧౮
# జె. యం. డెంట్

అమెరికా సంయుక్తరాష్ట్రములందలి పుస్తక ప్రచురణకర్తల డైరెక్టరీ ఒకటి ఇటీవల ప్రకటితమైనది. అందు రెండువేలకు పైబడిన గ్రంథప్రచురణాలయముల చిరునామాలు ముద్రితమైనవి.

అది ప్రత్యేకము ఒక గ్రంథసంపుటముగ తయారైనది. అచటివారి పుస్తకపఠనాభిలాషకు అది ఒక మానదండము.

అమెరికా సంయుక్తరాష్ట్రములందేకాక గ్రేట్‌బ్రిటన్‌నందును గ్రంథప్రచురణవ్యాపారము విస్తృతమై ఉన్నది. గ్రేట్‌బ్రిటన్‌కు ఈ విషయమై పేరు తెచ్చినవారిలో మనప్రస్తుత కథకు నాయకుఁడైన జె. యం. డెంట్ ఒకఁడు.

అది క్రీస్తుశకము ౧౮౬౭-వ సంవత్సరము. అప్పటికి డెంట్‌కు పదునేడవ వత్సరము. అతఁడు లండన్ మహానగరమునకు వచ్చిచేరెను. ఆ సమయమున అతనిచేతిలో రాగి దమ్మిడీయైన లేదు.

అతని పుట్టుక డార్లింగ్‌టన్‌లో. అతనికి పదియేండ్లు వచ్చుసరికి అతనితండ్రి వ్యాపారము చితికిపోయినది. వ్యాపారము చేయుచు ఖాతాదారులు పలువురకు అరువులు ఇచ్చుటచే డెంట్ తండ్రి ఎత్తుపడిపోయెను.

ఆ కుటుంబములో పదిమంది పిల్లలు. వారిపోషణ పెద్ద సమస్య ఐనది. కాగా డెంట్ పదమూడవ ఏఁట నౌకరు కావలసి వచ్చినది.

డెంట్ కుంటివాఁడు. పాఠశాలలో ఉండిన కొద్దిరోజులలో మొద్దు అబ్బాయి అనిపించుకొనినాఁడు. తండ్రి వ్యాపారమున ఎత్తుపడినాఁడు. విత్తవంతులైన పినతండ్రులు పెదతండ్రులు కాని—ధనస్వాములైన మేనమామలు కాని అతనికి లేరు. సౌకర్యములు అనునవి ఎట్టివి కాని అతనికి లేవు.

ఒకే ఒక సుగుణముమాత్రముండెను. అది పుస్తకముల పట్ల అతనికికల వల్లమాలిన 'వలపతము.' ఏదియొ ఒకవిధముగ పుస్తకములతో అనుబంధితుఁడై ఉండుటను అతఁడు అతిగాఢముగ అభిలషించెను

కాగా లండన్ మహానగరమున ఒక చిన్న బుక్కు-బైండర్ వద్ద అతఁడు మొదట ఉద్యోగమును సంపాదించెను. కొద్దిపాటి జీతము. అయినను డెంట్ నిరుత్సాహపడలేదు. వివిధవృత్తులకు కాణాచియైన ఆ మహానగరములో పుస్తకములతో అనుబంధితమైన వృత్తిలో ఉద్యోగము దొరికినందుకు అతఁడు ఎంతయో మురిసినాఁడు.

అతనికి ఇరువదిమూడవ ఏఁడు జొరఁబడినది. అప్పుడు అతని అదృష్టరేఖ బయటపడినది. జార్జిగ్రాంట్ అను ఒకానొక వర్తకమిత్రుఁడు డెంట్ సొంతముగ బుక్కు-బైండింగ్

వ్యాపారము చేయుటకు రెండువందల ఏబదిపౌనులు అప్పు ఇచ్చినాడు.

ఆ పైకముతో డెంట్ బుక్కుబైండింగ్ షాపును, జె. యం. డెంట్ అండ్ సన్సు అను నామముతో పుస్తక ప్రచురణ వ్యాపారమును ప్రారంభించినాడు.

ప్రారంభించిన కొద్దిరోజులకే అతని దుకాణము పరశురామప్రీతిని అందెను. అగ్నిభీమావలన వచ్చిన పైకము మాత్రమే ఇక అప్పుడు అతనికి కల సమస్తమును. ఋణావంతుడు అప్పుతీర్చి కాని అంగణమున ఉండకూడదు అను నీతిని ఎఱిఁగిన ప్రాజ్ఞుడు కావున డెంట్ ఆ పైకమును పట్టుకువెళ్ళి జార్జిగ్రాంట్‌కు ఇచ్చివేయఁబోయినాఁడు. కాని గ్రాంట్ ఆ ధనమును పుచ్చుకొనక తిరిగి డెంట్‌కు ఇచ్చినాఁడు. డెంట్ పుస్తకవ్యాపారమును పునః ప్రారంభముచేసినాఁడు.

మిత్రుని ప్రభుశక్తియందు గ్రాంట్‌కు అవధిలేని నమ్మకము ఉండినది. ఋణదాత గ్రాంట్ తనయందు ఉంచిన నమ్మకమును ఋణికుఁడు డెంట్ సార్థకపఱచినాఁడు.

అచిరకాలములోనే లండన్‌లోని ప్రసిద్ధగ్రంథప్రచురణకర్తలలో డెంట్ ప్రముఖస్థానమును సంపాదించెను. అతఁడు ఉత్తమగ్రంథములనే ప్రచురించువాఁడు. క్షుద్రగ్రంథములపొంత పోవువాఁడు కాడు. చెలామణీ హెచ్చుగ ఉండు చిల్లర పుస్తకముల ప్రచురణపై అతని దృష్టి ఎన్నడును ప్రసరింపలేదు. 'ఎవ్విరిమాన్సు లైబ్రెరీ' అనుపేర ప్రకటితములైన డెంట్ కంపెనీ గ్రంథములు విశ్వవిఖ్యాతములు.

ఉత్తరవయస్సున అతనికి ధనముతోకూడ యశోధనము అగ్గలముగ ఒనగూడెను; మేధావంతులైన పేటి

గ్రంథకర్తలతో చెలిమి కలిగెను. నాటి బైండర్ నేటిస్థితి ఇట్టిది !

అతడు కుటుంబి ఐ ఎనమండుగురు బిడ్డలను కనినాడు యూరోపా, అమెరికా ఖండములందు సారస్వతయాత్ర సలిపినాడు. ఇంగ్లండు పట్ల అతనికి కల అభిమానము అవధిలేనిది. ఇంగ్లండు తరవాత అతడు ఇటలీదేశమును మిక్కిలి అభిమానించువాడు.

ప్రథమప్రపంచసంగ్రామమున అతని తనయులు ఇరువురు వీరమరణ మందిరి. అయినను అతడు వికలచిత్తుడు కాలేదు.

ప్రఖ్యాతగ్రంథములను పేదవారి అందుబాటునకు తెచ్చుట అతని జీవితాశయమై ఉండెను.

ఆ ఆశయమును సిద్ధింపజేసికొని అతడు తన డెబ్బదియేడవ ఏట మరణించెను. జీవితకాలమంతయు సారస్వతప్రశంసలలో, కావ్యగోష్ఠిలో ఉండి అతడు చరితార్థుడైనాడు.

"పుస్తకములు నాకు ఉపకారపూర్వకమైన ఉపశమనము కలిగించునవిగా, సానునయపూర్వకమైన సహకారము చేయునవిగా ఉండినవి. అట్టి పుస్తకముల ఉత్పత్తితో నేను నా జీవితమున అఱువదివత్సరములు అంకితముచేసినవాడనై ఉండినందులకు అమందమైన ఆనందమును పొందుతున్నాను' అని అతడు కడకాలమున తఱచు అనుచుండువాడు.

ఆంగ్లగ్రంథముల అంగళ్ళవాడలో జె. యం. డెంట్ నామము చిరస్మరణీయమైనది.

ఆంధ్ర ప్రింటింగ్ హౌస్, పరశువాకము, మదరాసు.